# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.




విడి ప్రతి
0-75 పైసలు

సంవత్సర చందా
రూ. 8-40

"ఉగాది శుభాకాంక్షలు!"


Roopkala
తప్పక చూడండి!
కె. విజయకుమార్ సమర్పించు
శ్రీ విజయలక్ష్మీ పిక్చర్స్ వారి
సరస్వతీ శపథం
(ఈస్టమన్ కలర్)
దర్శకత్వం: ఏ.పి.నాగరాజన్
సంగీతం: కే.వి.మహాదేవన్


OVOMALT








Ovomalt
OVO
FOOD

## చూశారా... గెవాబాక్స్ రెప్పపాటులోపుగానే తీస్తుంది. ఎందుకంటే, దీనిలో 1/100వ సెకండ్ స్పీడ్ అయినా వుంది.



# గెవాబాక్స్ !

గెవాబాక్స్‌కు 3 స్పీడ్స్ వున్నాయి–బల్బ్ 1/50వ మరియు 1/100వ సెకండ్‌లు. ఆటలు, పిక్‌నిక్‌లు, పార్టీలలోని ఉత్సాహపూరితమైన దృశ్యముల ఫొటోలను తియ్యండి.

గెవాబాక్స్ యొక్క అమూల్యమైన ఇతర లక్షణములు —

* అద్భుతమైన దీర్ఘ చతురస్రాకారపు ఛాయా చిత్రములు (6 సెం.మీ×9 సెం.మీ.) ఆ తరగతిలో పోల్చదగిన కెమేరాల నుండి వచ్చే వాటికంటే, 50% పెద్దవి. అత్యంత ఉత్తమమైన ఎన్‌లార్జ్‌మెంట్‌లు లభిస్తాయి • ఉజ్వలమైన స్పష్టముగు ఐ-లెవెల్ వ్యూఫైండర్ • 2 ఎపర్చెర్‌లు (f11 మరియు f16) * దృఢమైన, అందముగు స్టీల్ బోడీ.

గెవాబాక్స్‌ను ఉపయోగించడం ఎంతో సులభం. ఒక సారి క్లిక్ చెయ్యండి. మీ గెవాబాక్స్ మిగిలినదంతా చేస్తుంది. ఖరీదు : రూ. 44.00



**ఫొటోగ్రాఫీని తెలుసుకోండి**

గెవాబాక్స్‌ను ఎంచుకోండి. ఫొటోగ్రాఫీ ఎటువంటి సరదా అంటే, మీకు ఏ సమయంలోనైనా, చిత్ర సంకలనం వలన, గడచిన విషయాలను జ్ఞాపకం చేసి సాటిలేని ఆనందాన్నిస్తుంది.

గెవార్ట్

# గెవాబాక్స్

గెవార్ట్ గెవాబాక్స్-ప్రొఫెషనల్ చిత్రములను తీసే ప్రజాదరణ పొందిన కెమేరా !

గెలవండి రూ. 100 ! "అగ్ఫా-గెవార్ట్ ఫొటో గ్యాలరీ"లో వివరములు లభిస్తాయి. 6 ఉచిత కాపీల కోసం (రూ. 1/- పోస్టేజ్‌కి పంపుతూ) వీరికి వ్రాయండి:



**అగ్ఫా-గెవార్ట్ ఇండియా లిమిటెడ్,**
కస్తూరీ బిల్డింగ్, జమ్‌షెడ్జీ టాటా రోడ్, బొంబాయి-1.

*Bensons/507A TL*

తప్పక చూడండి!













శ్రీదేవి ప్రొడక్షన్స్ వారి

# భువనసుందరి కథ



దర్శకత్వం: సి.పుల్లయ్య · సంగీతం: ఘంటసాల · నిర్మాత: తోట సుబ్బారావు

పూర్ణా రిలీజ్.

STUDIO

SREEKRISHNA PUBLICITIES



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మంచి పనులు చేసేవాళ్ళంతా మంచి వాళ్ళు కాక పోవచ్చు. కొందరు "ప్రభువులు" ["ధర్మసత్రం"] కీర్తి కాంక్షతో "మంచి" పనులు చేస్తారు. కాని అంత మాత్రాన వారిలోని "చెడు" దాగదు; అది వారి మాటలలోనూ, చేతలలోనూ, ఆలోచనలలోనూ అనుక్షణమూ బయట పడుతూనే ఉంటుంది. అన్నిటి కన్న ముఖ్య విషయ మేమంటే, అలాటివారు నిజమైన మంచి వారిని సహించలేరు; ప్రత్యేకించి ఆ మంచివారి పట్లనే తమ నీచత్వం బయట పెట్టుకుంటారు.

సంపుటి 40 ఏప్రిల్ '67 సంచిక 4

CHITRA



# భారత చరిత్ర



17 వ శతాబ్ది పూర్వార్థంలో ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ అంతగా లాభం చేసుకోలేదు, కాని ఉత్తరార్థంలో బ్రిటిషు ప్రభుత్వం నుంచి కొత్త సౌకర్యాలు పొంది పైకి వచ్చింది. దానికి మూలధనం కూడా ఏర్పడటంతో ఆర్థికచిక్కులు తొలగాయి.

ఈ కాలంలోనే దానికి "కోరలు" వచ్చాయి. అంత దాకా శాంతియుతంగా వ్యాపారం చేసుకుంటూ వచ్చిన కంపెనీ శక్తిమంతంగా తయారై కొన్ని ప్రాంతాలను స్వాధీనం చేసుకునే ప్రయత్నంలో పడింది. దీనికి కొంత కారణం దేశంలోని అరాజక పరిస్థితే. 1669 నుంచి బొంబాయి గవర్నరుగా పని చేసిన జీరల్డ్ అంగియర్ అనే వాడు కంపెనీ డైరెక్టర్లకు రాస్తూ, "ఇక నుంచి మీరు చేత కత్తిపట్టి మీ వ్యాపారాన్ని నిర్వహించుకోవలసి ఉంటుంది," అని హెచ్చరించాడు.

కంపెనీ పాలసీలో మార్పు వచ్చింది. ఇండియాలో బ్రిటిషు వలస ఏర్పాటు కావటానికి కృషి ప్రారంభ మయింది. కంపెనీ ప్రముఖులలో అగ్రేసరుడైన సర్ జాన్ చైల్డ్, 1688 డిసెంబరులో బొంబాయి రేవునూ, పశ్చిమ తీరాన గల మొగలు రేవులనూ ముట్టడించాడు. అనేక మొగలు నౌకలు పట్టుబడ్డాయి.

అయితే ఇది తొందరపాటు చర్యగా పరిణమించింది. మొగలు సామ్రాజ్యం ఇంగ్లీషువాళ్ళు అనుకున్నంత దుర్బలంగా లేదు. సర్ జాన్ చైల్డ్ ఔరంగజేబుకు క్షమాపణ చెప్పుకుని, తాను పట్టుకున్న మొగలు నౌకలతో బాటు లక్షన్నరరూపాయలు పరిహారం కూడా ఇచ్చుకోవలసి వచ్చింది. 1690 ఫిబ్రవరిలో ఔరంగజేబు బ్రిటిషు వారు వర్తకం చేసుకునేటందుకు లైసెన్సు మంజూరు చేశాడు.

---



బెంగాలులో కూడా ఇంగ్లీషువారి వ్యాపార సౌకర్యం నిమిత్తం సుల్తాన్ షుజా 1651లో ఒక ఫర్మానూ, 1656 లో ఒక నిషానూ జారీ చేశాడు. కాని షుజా అనంతరం అతని వారసులు ఆ సౌకర్యాలను రద్దుచేశారు. 1672 లో షైస్తఖాన్ జారీ చేసిన ఫర్మాను లాభాన్ని కూడా ఇంగ్లీషు కంపెనీ ఆచరణలో పొందలేక పోయింది. అందుచేత కంపెనీ వారు బలప్రయోగంతో తమ పబ్బం గడుపు కోవటానికి నిశ్చయించి, హుగ్లీలో ఒక కోట నిర్మించారు. 1686 అక్టోబరులో ఇంగ్లీషు వారికీ, మొగలులకూ యుద్ధం జరిగింది. ఇంగ్లీషువారు హుగ్లీ నుంచి పారిపోయి, నదీ ముఖంలో ఉన్న ఒక దీవి చేరి, అక్కడి నుంచి సంధి సంప్రదింపులు జరిపారు. సంధి అయితే జరిగింది గాని, మరుసటి ఏడు కాప్టెన్ విలియం హీత్ అనేవాడి నాయకత్వాన ఇంగ్లండు నుంచి ఒక నౌకా దళం వచ్చి, చిటగాంగును ఆక్రమించ టానికి ప్రయత్నించి విఫలమయింది.

1690 లో ఔరంగజేబుతో చేసుకున్న సంధి అనంతరం ఇంగ్లీషువారు ఇలాంటి చిలిపి చేష్టలు కట్టిపెట్టారు. జాబ్ చార్‌నోక్ అనే ఇంగ్లీషు ఏజెంటు వివేకం గలవాడు. అతను 1690 ఆగస్టులో బెంగాలులోని



సుతమతీ అనే చోట ఒక ఇంగ్లీషు ఫాక్టరీ నిర్మింపజేశాడు. 1691 ఫిబ్రవరిలో మొగలుచక్రవర్తి ఉత్తరువు పైన, బెంగాలు లోని పాలకుడైన ఇబ్రాహీంఖాన్ ఒక ఫర్మాను జారీ చేస్తూ, ఇంగ్లీషువారికి ఎలాటి సుంకాలూ లేకుండానూ, వారు ఏటా 3 వేల రూపాయలు ఇచ్చేటట్టూ ఏర్పాటు చేశాడు.

బర్ద్వాన్‌జిల్లా లోని జమీందారు (శోభా సింగు) తిరుగుబాటు చేయటం సాకుగా పెట్టుకుని ఇంగ్లీషువారు 1696 లో తమ ఫాక్టరీకి రక్షణలు నిర్మించుకున్నారు. మరి రెండేళ్ళ అనంతరం వారు, సుతమతీ, కలికాతా (కలకత్తా), గోవిందపూరు అనే

మూడు గ్రామాలను 1200 రూపాయలకు కొనుక్కున్నారు.

ఇంగ్లండులో రెండవ చాల్స్, రెండవ జేమ్స్ పరిపాలించిన కాలంలో కంపెనీ చాలా లాభం పొందింది. అయితే 1694 లో ఈ కంపెనీకి గల గుత్తాధికారాలను అంతం చేస్తూ బ్రిటిషు పార్లమెంటు ఒక తీర్మానం చేసి, ఇండియాతో వ్యాపారం కొనసాగించే హక్కు ప్రతి ఇంగ్లీషువాడికీ ఉన్నదని నిర్ణయించింది. 1698 లో ఇది చట్టం అయింది. జనరల్ సొసైటీ అనే ఒక నూతన సంస్థ కూడా ఏర్పాటయింది. పాత కంపెనీ, తన వ్యాపారహక్కులను దక్కించుకొనటానికి 1707 లో ఈ సంస్థలో చేరింది. అయితే పాత కంపెనీకి పోటీగా "ఇంగ్లీషు వర్తకుల కంపెనీ" అంటూ మరొకటి బయలుదేరింది.

ఈ కొత్త కంపెనీ తరఫున సర్ విలియం నోరిస్ అనేవాడు రాయబారిగా మొగలు దర్బారుకు వచ్చి తమ కంపెనీకి ప్రత్యేక సౌకర్యాలు కోరాడు. ఈ కోర్కె అమలు కాలేదు. చివరకు ఈ రెండు కంపెనీలూ ఏకమై, 1793 దాకా గుత్తవ్యాపారం పోటీ లేకుండా సాగించాయి.

18 వ శతాబ్దంలో తొలి 40 ఏళ్ళపాటు ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ వ్యాపారం అభివృద్ధి చెందింది. దేశంలోని రాజకీయ అవ్యవస్థ ఆ వ్యాపారానికి చెప్పుకోదగిన అవాంతరా లేమీ కలిగించలేదు. 1715 నుంచీ మొగలు దర్బారుకు కంపెనీ తరఫున రాయబారి కూడా ఉంటూ వచ్చాడు. రాయబార వర్గానికి చెందిన వైద్యుడొకడు (విలియం హామిల్టన్) చక్రవర్తి ఫరుఖ్ సియర్‌కు చికిత్స కూడా చేశాడు. ఇందువల్ల కంపెనీకి లాభించింది. వారు లోగడ చెల్లించుతూ వచ్చిన సుంకాలు కొన్ని మాఫీ చేయబడ్డాయి. బొంబాయిలో సిక్కా వేసే కంపెనీ నాణాలకు మొగలు సామ్రాజ్యమంతటా చలామణీ లభించింది.



# నెహ్రూ కథ

## 34



1936 ఆగస్టులో కాంగ్రెసు ఎన్నికల సంరంభం ప్రారంభించి, ఒక ప్రణాళిక విడుదల చేసింది. జవాహరు ఉపన్యాసా లిస్తూ దేశ సంచారం చేశాడు. అతను కాంగ్రెసుకు వోట్లివ్వమని అడగలేదు. దేశంలో ఉన్న పరిస్థితి గ్రహించి, తమ ఇచ్ఛానుసారం చెయ్యమన్నాడు.

1936 డిసెంబరు 11 న జవాహరు మూడోసారి కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నిక అయాడు. వరసగా మూడుసార్లు కాంగ్రెసు అధ్యక్షత వహించటం అతని కిష్టంలేదు. కాని కాంగ్రెసు యొక్క ఐక్యతను నిలబెట్ట గలవాడు అతను తప్ప మరొకడు ఆ తరుణంలో లేడు.

ఫైజ్‌పూర్ కాంగ్రెసు సమావేశంలో జవాహరు భారతీయ స్వాతంత్ర్యాన్ని గురించి గట్టిగా మాట్లాడాడు, బ్రిటిషు వైదేశిక విధానాలను ఖండించాడు. హిట్లరునూ, స్పెయినులో ఫాసిస్టులనూ నిరసించి, అంతర్జాతీయ ప్రజాతంత్రాన్ని సమర్థించాడు.

ఎన్నికలు వచ్చాయి. ఏడు రాష్ట్రాలలో కాంగ్రెసు గెలిచింది. ఢిల్లీలో కాంగ్రెసు శాసనసభ్యు లందరూ సమావేశమై పదవీ స్వీకరణకు అనుకూలంగా నిర్ణయం చేశారు. జవాహరుకు ఈ నిర్ణయం ఇష్టంలేదు. కాంగ్రెసు కార్యకర్తల నిజమైన కార్యరంగం శాసనసభలు కాదని అతను జ్ఞాపకం చేశాడు.

ముస్లిము ప్రజానీకాన్ని కాంగ్రెసు ఉపలక్షించిన కారణంగా ఎన్నికలలో కాంగ్రెసుకు ముస్లిము వోట్లు అంతగా పడలేదు. ముస్లిములకు వేరే సమస్యలున్నట్టు జిన్నా మాట్లాడాడు. రైతులలో హిందువులకూ ముస్లిములకూ వేరు వేరు సమస్యలు లేవని నెహ్రూ వాదం. ఇద్దరి మధ్యా కొంత ఘర్షణ జరిగింది.



1938 ఆరంభంలో కాంగ్రెసు కాబినెట్ బొంబాయిలో సమావేశమైంది. కాంగ్రెసుకూ, ప్రభుత్వానికీ మధ్య ఘర్షణ జరిగే సూచనలు కానవచ్చాయి. ప్రభుత్వం రాజకీయ ఖైదీల విడుదల పట్ల మూర్ఖించింది. ఫెబ్రవరిలో బిహారు, యు. పి. మంత్రి వర్గాలు రాజీనామా ఇచ్చేశాయి. "సంఘర్షణకు సిద్ధంగా ఉండండి," అని జవాహరు జాతీయవాదులను హెచ్చరించాడు.

హరిపురా కాంగ్రెసు సమావేశానికి సుభాష్ బోసు అధ్యక్షుడుగా ఎన్నికయాడు.

స్పెయిన్‌లో ప్రజాతంత్రం హత్య చేయబడుతున్నది. జులైలో జవాహరు ఆ దేశానికి



వెళ్ళి, అక్కడ ఫాసిస్టు, నాజీ బాంబర్లు చేసే విధ్వంసమూ, ప్రజల వీరోచిత పోరాటమూ, క్షామ పరిస్థితులూ స్వయంగా చూసి, దేశానికి తిరిగి వచ్చి, స్పెయిను ప్రజల నిమిత్తం ఒక స్టీమరు నిండా ఆహార పదార్థాలు పంపాడు.

హిట్లరు దాహం తృప్తిపరచటానికి బ్రిటిషు ప్రధాని చేంబర్లేన్ జెకోస్లవేకియాను బలి పెడుతూ జినీవాలో ప్రసంగించినప్పుడు జవాహరు జినీవాలోనే ఉన్నాడు. "ప్రపంచానికి ఉపద్రవం ముంచు కొస్తున్నది. చిట్కా వైద్యాలతో ఈ వ్యాధి కుదరదు; ప్రపంచంలోని అభ్యుదయ శక్తులన్నీ ఏకం కావాలి. ఈ ఐక్యసంఘటనలో భారత దేశం తగిన పాత్ర వహించగలదు—కాని ముందు అది స్వతంత్రం కావాలి," అన్నాడు జవాహరు.

1939 ఆరంభంలో స్వదేశసంస్థానాలలో అలజడి సాగింది. అక్కడ అమలులో ఉన్న ఫ్యూడల్ వ్యవస్థలో ప్రజలు అమానుషమైన కష్టాలు పడ్డారు. చివరకు పాపం బద్దలయింది. జయపూరులో ప్రారంభమైన అశాంతి రాజకోటకు పాకింది. మిగతా సంస్థానాలలో కూడా ప్రజలు తమతమ ప్రభువుల పైన తిరుగుబాటు చేశారు.



లూధియానాలో సంస్థాన ప్రజల మహా సభ ఏర్పాటయింది. దానికి జవాహరు అధ్యక్షుడు. సమావేశంలో 600 సంస్థానాల ప్రజాప్రతిధులు పాల్గొన్నారు. నెహ్రూ ఊరేగింపు నిడివి రెండుమైళ్ళు. లక్షమంది ప్రజలు ఆ ఊరేగింపును తిలకించారు.

"ఇది ఒక దుష్టవ్యవస్థ. ఇది మన దేశంలో ఏనాడో అంతరించింది. కాని బ్రిటిషుపాలకులు తమ అవసరం కొరకు దీనికి జీవం పోసి, నిలబెట్టి ఉంచారు," అన్నాడు జవాహరు.

1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభ మయింది. యుద్ధం రావటానికి ఆరుమాసాలు ముందే జవాహరు, "బ్రిటన్, ఫ్రాన్స్, రష్యా, అమెరికాలు ఏకమైతే అవి జయించరానివి. కాని బ్రిటను ఫ్రాన్సులు రష్యాతో చేతులు కలపవు. అందువల్ల రష్యా నుంచి ఇండియాకు కొత్త భావాలు దిగుమతి అవుతాయని వాటికి భయం," అని చెప్పాడు.

యుద్ధం ఆరంభమయాక కాంగ్రెసు, "మీ యుద్ధాశయాలేమిటి?" అని బ్రిటను ఫ్రాన్సుల నడిగింది. సామ్రాజ్యవాదుల వర్తమాన పరిస్థితిని పరిరక్షించుకోవటమే యుద్ధాశయమైతే, ఇండియాకు




ఈ యుద్ధంతో ఎలాటి ప్రసక్తి ఉండబోదనీ, ప్రజాస్వామ్యాన్ని కాపాడటానికి యుద్ధం జరిగే పక్షంలో అందులో తామూ ఉంటామనీ కాంగ్రెసువారు స్పష్టం చేశారు.

కాని భారతదేశం బలాత్కారంగా యుద్ధంలోకి లాగబడింది. బ్రిటిషువారు తమ యుద్ధాశయాలను ప్రకటించని కారణం చేత కాంగ్రెసుమంత్రు లందరూ తమ పదవులకు రాజీనామా లిచ్చేశారు. వ్యష్టి సత్యాగ్రహం ప్రారంభ మయింది.

జపాను భారతదేశపు సరిహద్దున యుద్ధం చేస్తున్న తరుణంలో సర్ స్టాఫర్డ్ క్రిప్స్ ఇండియాకు వచ్చాడుగాని రాజీ

కుదర్చలేక పోయాడు. కాంగ్రెసు ప్రతినిధులుగా జవాహరూ, మౌలానాఆజాదూ క్రిప్స్‌తో మాట్లాడారు. బ్రిటను‌కు అధికార విసర్జన చేసే ఉద్దేశం లేదు. అది భారత స్వాతంత్ర్యాన్ని గుర్తించదు.

"భారత దేశం తన బలంతోనే స్వాతంత్ర్యం సంపాదించుకుంటుంది," అని కాంగ్రెసు తీర్మానించిది.

1942 అగస్టులో బొంబాయిలో కాంగ్రెసు సమావేశం జరిగింది. "క్విట్ ఇండియా" తీర్మానం జరిగింది. కాని అప్పటికే ప్రజలకు "క్విట్ ఇండియా" అన్నది జాతీయవిమోచన మంత్ర మయింది. అది ప్రతి గోడ మీదా వెలిసింది. జాతీయోద్యమం ప్రారంభమైన ఇంత కాలానికి గాంధీజీయే విప్లవవాదిగా పరిణమించాడు!

అయితే కాంగ్రెసు ఉద్యమం ప్రారంభించక ముందే, ప్రభుత్వం మర్నాడు తెల్లవారుఝామునే కాంగ్రెసునాయకు లందరినీ ఒక్కసారిగా అరెస్టు చేసి, విక్టోరియా టెర్మినస్ (బొంబాయి) స్టేషనుకు తీసుకుపోయి, రైలులో ఎక్కించింది.

అరెస్టయిన వారందరూ కలిసి ముప్ఫై మంది. అందరూ కాంగ్రెసు సమావేశంలో పాల్గొన్న అగ్ర నాయకులే. గాంధీజీని చించ్‌వాడీ వద్ద దించారు. ఆయనను ఆగాఖాన్ భవనంలో ఖైదీగా ఉంచారు. బొంబాయి నాయకులు ఎర్రవాడ జైలుకు తీసుకుపోబడ్డారు. మిగిలిన వర్కింగుకమిటీ సభ్యులను పూనా తీసుకుపోయి, అక్కడి నుంచి అహమ్మద్‌నగర్ కోటకు చేర్చారు.

నాయకులు అరెస్టయినారని తెలియగానే దేశమంతటా ప్రజలు ఆగ్రహావేశం చెందారు. నాయకత్వం లేకుండానే వారు ప్రభుత్వాన్ని ఎదిరించి, దారుణమైన హింసలకు గురి అయి, దెబ్బకుదెబ్బ తీయ యత్నించారు. 1857 తరవాత దేశంలో సాగిన స్వాతంత్ర్య సమరం ఇదే.





# పాతాళదుర్గం

## 12

[ధూమకుడూ అతడి మిత్రులూ దాగివున్న చెట్టును మొసలిమనుషులు చూశారు. వాళ్ళు తమను సమీపించే ముందే, ధూమకుడూ వాళ్ళు చెట్టు దిగి కొండమలుపు కేసి పరిగెత్త సాగారు. వాళ్ళను పట్టుకునేందుకు శత్రువులు వెంటబడ్డారు. వాళ్ళల్లో ఒక ముఠా యీటెలు పట్టుకుని ఎదురుగా వచ్చి, లొంగిపోవలసిందిగా కేకలు వేశారు. —తరవాత]

ధూమకుడు ఏ మాత్రం భయపడక ఒక సారి వెనక్కు తిరిగి చూశాడు. చావగా మిగిలిన మొసలిమనుషులు తిరిగి కాలి బాట పట్టుకుని వాళ్ళ వెన్నంటి పరిగెత్తుకు వస్తున్నారు.

"సోమూ, యీ వెనక వచ్చే దుర్మార్గుల పని నే పడతాను. నువ్వూ, విరూపుడూ ఆ కాకిగోల చేస్తున్న వాళ్ళ మీద బాణాలూ, ఈటెలూ ప్రయోగించండి," అని హెచ్చరించి ధూమకుడు ఈటె ఎత్తి మొసలి మనుషుల మీదికి బలంగా విసిరాడు. ఈటె తమ కేసి రావటం చూస్తూనే, వాళ్ళు ఒక్క కేకపెట్టి, మళ్ళీ కాలిబాట వదిలి పక్కలకు పరిగెత్తారు. ఈ లోపల సోమకుడూ, విరూపుడూ వదిలిన ఆయుధాలు కొండమలుపులో పడవ దగ్గిర వున్న మొసలి మనుషుల మీదికి వెళ్ళిపడినై. "ఆఁ, ఎంత సాహసం!" అంటూ మొసలిమనుషుల్లో





ఒకడు పెద్దగా అరిచాడు. వాడు బాగా ఒడ్డూపొడుగూ వున్నాడు; వాడు ఆ ముఠా నాయకుడు.

"ఊఁ చంపండి, నరకండి! ముందుకు దూకండి! ఏం భయంలేదు, నేనిక్కడే వుంటాను," అంటూ వాడు కేకలు పెట్టాడు. మొసలిమనుషులు ఈలలు బారుచేసి ధూమకుడూ వాళ్ళ కేసి దూకబోయేంతలో, కొండమలుపు నుంచి భిల్లులు కొందరు రణగొణ ధ్వని చేస్తూ వాళ్ళ మీదికి పరిగెత్తుకు రాసాగారు.

"మోసం, చచ్చాం, ఘోరం, ప్రమాదం, రాక్షసేంద్రులవారికీ, జై! అంతా మోకు పట్టుకుని పడవ మీదికి చేరండి. దారి చూపేందుకు ముందు నన్ను పోనివ్వండి," అంటూ మొసలిమనుషుల నాయకుడు చెట్టుకు కట్టి వున్న పడవ మోకును పట్టుకుని వేళ్ళాడుతూ, పడవ కేసి పోసాగాడు. అతడి అనుచరులు ఒకళ్ళనొకళ్ళు పక్కకు తోసుకుంటూ వెళ్ళి మోకు పట్టుకుని, కోతుల్లా వెళ్ళాడుతూ పడవ దగ్గిరకు బయలుదేరారు.

"ఆ మోకు నరకండి! ఈ దుర్మార్గులకు నీటి చావే తగిన శిక్ష!" అంటూ భిల్లుల్లో నుంచి ఒకడు కేక వేశాడు. ఆ కేక వేసినవాడు భిల్లనాయకుడైన పులిందుడు. మరుక్షణం భిల్లుల్లో ఒకడు ముందుకు దూకి, చెట్టుబోదెకు కట్టి వున్న మోకును ఒక్క వేటుతో నరికాడు. మొసలిమనుషులు ఆహాకారాలు చేస్తూ, నదీజలంలో పడ్డారు. అంతవరకూ కదలకుండా బంధించి వుంచిన మోకు తెగిపోవటంతో, పడవ ప్రవాహవేగానికి చప్పున ఒక పక్కకు ఒరిగిపోయింది. పడవలో నుంచి ఒక స్త్రీ కంఠం "రక్షించండి!" అంటూ పెద్దగా ఆర్తనాదం చేసింది.

ఆ ఆర్తనాదం వింటూనే పులిందుడు ఎగిరి గంతేసి, "ఆ కేకలు పెడుతున్నది





నా చిన్న పెళ్ళాం. పడవ మునిగిందో చచ్చి పోతుంది. ఎలాగైనా పడవను పట్టుకోవాలి. వెళ్ళి తెప్పలు తీసుకురండి," అంటూ తన అనుచరులను అజ్ఞాపించాడు.

ఇంతలో ధూమకుడూ అతడి మిత్రులు నది ఒడ్డుకు చేరారు. వాళ్ళను చూసి పులిందుడు పొందిన ఆనందం అంతా యింతా కాదు. అతడు పరుగు పరుగున ముందుకు వచ్చి ధూమకుణ్ణి కావిలించు కుంటూ, "ధూమకదొరా! నా చిన్న పెళ్ళాం యీ పడవలోనే బంధించబడి వుంది. రక్షించమని కేకలు వేస్తున్నది. మనం పడవను పట్టుకోవటం ఎలా?" అని ప్రశ్నించాడు.

ధూమకు డోసారి పడవ కేసి చూశాడు. మొసలిమనుషుల్లో కొందరు అరుస్తూ, ప్రవాహవేగానికి మునుగుతూ తేలుతూ పడవను దాటి ముందుకు కొట్టుకుపోతున్నారు. మరికొందరు ఆయాసపడుతూ పడవ కేసి ఈదుకు పోతున్నారు.

"పులిందా, నీవు చెట్టుకు కట్టి వున్న పడవ మోకును నరకవలసింది కాదు. ఆ మోకుతో మనం పడవను ఒడ్డుకు లాగే పని. రాక్షసబ్బంట్లు చాలామంది నది వాలుకు కొట్టుకుపోయి మునిగిచావటం ఖాయం. పడవ కేసి యీదుకుపోయే కొద్ది



మందీ దాన్ని చేరగలరన్న నమ్మకం నాకు లేదు. ఇంతకూ పడవలో ఒక్కగా నొక్క డైనా లేకుండా అంతా ఒడ్డు కెలా వచ్చే శారు?" అంటూ ధూమకుడు మాట్లాడు తున్నంతలో, పడవ లోపలి గదుల్లో నుంచి పొట్టిగా వామనుడిలా వున్న రాక్షసుడొకడు గెంతుతూ పడవ చుక్కాని వద్దకు వచ్చాడు. వాడు చుక్కాని చేత పట్టుకుని అటూ యిటూ గుంజగానే పడవ ఒరగటం మాని, ఎప్పటిలా నీళ్ళ మీద తేలసాగింది.

పొట్టిరాక్షసుడు పళ్ళుకొరుకుతూ ఒకసారి ఒడ్డు నున్న ధూమకుడూ వాళ్ళ కేసి చూసి, దాపుల నున్న తెడ్డు తీసుకుని, దానితో పడవ



కేసి యీదుకు వస్తున్న మొసలిమనుషుల్లో ఒకడి తల మీద గట్టిగా కొట్టి, "పోండి చపటల్లారా, దూరంగా పోండి. మీకూ, కాల కలిగాడికీ ఒక్క దణ్ణం. పడవ నాది, పడవలో వున్న భామామణి నాది. మేం యిద్దరం యీ మహారణ్యంలో ఎక్కడో ఒక మారుమూల కొంప కట్టుకుని, ఎవరి గొడవా లేకుండా హాయిగా బతుకుతాం," అన్నాడు.

ఆ మాటలు వింటూనే పులిందుడు ఉగ్రుడై పోయి, "ఒరే, దుర్మార్గుడా! మొగుణ్ణి నేను బతికుండగానే, నా పెళ్ళాన్ని మారుమనువు కట్టుకుంటావా?" అంటూ నదిలో దూకి పడవ కేసి ఈదబోయాడు.

కాని, విరూపుడు చప్పున అతణ్ణి పట్టుకుని బయటికిలాగి, "తొందరపడకు పులిందా. ఇప్పుడు నీవు ఒంటరిగా పడవ దగ్గిరకు పోవటం అంటే, ఆ రాక్షసుడి చేతిలో చావటమే. మన తెప్పలు రానీయ్, పడవను వెంటాడి, ఆ రాక్షసుణ్ణి హతమార్చి నీ పెళ్ళాన్ని కాపాడదాం," అన్నాడు.

పొట్టి రాక్షసుడు గాడిద ఓండ్ర పెట్టినట్టుగా పెద్దగా ఓసారి నవ్వి, "ఒకళ్ళనొకళ్ళు మోహించి పెళ్ళాడటం మారుమనువవుతుందిరా, మనిషీ?" అని తెడ్డుతో పడవను సమీపించబోతున్న మరొక మొసలి మనిషి నెత్తిన బలంగా కొట్టి, పడవను నీటివాలుకు తిప్పాడు.

"పోయె, నా చిన్న పెళ్ళాం, చేజారి పోయె!" అని అరుస్తూ పులిందుడు మళ్ళీ నీట్లో దూకబోయేంతలో విరూపుడు అతడి నడుం పట్టుకుని వెనక్కులాగాడు. ఈలోపల సోమకుడు బాణం ఎక్కుపెట్టి రాక్షసుడి మోకాలి చిప్పకు గురిచేసి కొట్టాడు. బాణం మోకాలికి తగలగానే రాక్షసుడు చుక్కాని వదిలి రెండు చేతులతో మోకాలు పట్టుకుని పడవ మీద పడి పోయాడు.

"అదీ కొట్టవలసిన దెబ్బ! వాడు చావడు, పడవనూ అంత వేగంగా యిష్టం వచ్చిన

వైపుకు నడపలేడు, భలే!" అన్నాడు ధూమకుడు.

నీటిలో సుడిగుండంలాంటి దాంట్లో చిక్కుకుని పడవ గిర్రున తిరగసాగింది. పొట్టిరాక్షసుడు లేచి నిలబడి, మోకాల్లో దిగిన బాణాన్ని లాగి దూరంగా విసిరివేసి, కుంటుతూపోయి మళ్ళీ చుక్కాని పట్టుకుని పడవను నీటి వాలు కేసి తిప్పాడు. అంతలో భిల్లులు తెడ్లువేసి నడుపుతున్న రెండు తెప్పలు అటు కేసి వచ్చినై. ఆ రెండూ యింతకు ముందు ధూమకుడూ అతడి అనుచరులకు నది దాటటానికి సహాయ పడిన తెప్పలే. వాటిల్లో ఒక దాని మీద నల్ల గరుడపక్షి కూడా వున్నది.

తెప్పలు రెండూ తీరానికి రాగానే ధూమకుడూ, విరూపుడూ ఒక దాని మీదికి ఎగిరి దూకారు. సోమకుడూ, పులిందుడూ మరో దాని మీదికి ఎక్కారు. పులిందుడు తీరంలో వున్న తన భిల్లానుచరులతో, రాక్షసుడి పడవకు తగలకుండా, దాని వేగాన్ని తగ్గించేందుకు మాత్రం, దాని కేసి రాళ్ళు విసరమన్నాడు. "పడవకు దెబ్బ తగిలి అది నదిలో మునిగిందో, మిమ్మల్ని నిలువునా చీల్చేస్తాను," అని హెచ్చరించాడు పులిందుడు వాళ్ళను.



బలంగా తెడ్లువేసి పడవను వెంట తగలమని ధూమకుడు భిల్లులను హెచ్చరించి, పులిందుడితో, "పడవ మునిగినా ఫరవా లేదు, మనం ఆ పొట్టిరాక్షసుణ్ణి ప్రాణాలతో పట్టుకోగలిగితే చాలు. వాణ్ణించి మనం కాలకలి వుండే పాతాళదుర్గానికి దారి తెలుసుకోవచ్చు," అన్నాడు.

"పడవ మునిగితే, నా చిన్న పెళ్ళాం గతేం కాను!" అన్నాడు పులిందుడు వణుకుతున్న గొంతుతో.

"ధూందొరా! పడవలో కాలశంబర మాంత్రికదొర కూడా ఖైదీగా వున్నాడని నా అనుమానం. మనం పడవను చెక్కు



చెదరకుండా పట్టుకోవాలి. పొట్టిరాక్షసుణ్ణి మనం నలుగురం మీద పడి పట్టుకోవటం ఏమంత పని?" అన్నాడు విరూపుడు.

పడవ నది వాలున పడి వేగంగా పోతున్నది. రాక్షసుడు తనను వెంబడిస్తున్న వాళ్ళ ఎత్తుగడ తెలిసినవాడిలా, చుక్కానిని నైపుణ్యంగా కదిలిస్తూ, పడవను వాళ్ళ కందకుండా నడుపుతున్నాడు. కాని, యీలోపల పులిందుడి అనుచరులు నది పక్కనే వున్న కొండగుట్టల మీది నుంచి పెద్దపెద్ద రాళ్ళను పడవ కేసి విసరసాగారు. ఆ రాళ్ళు పడవ ముందూ, పక్కలనా పడి నీటిని అల్లకల్లోలం చేస్తున్నవి. పడవను ముంచేందుకే వాళ్ళు పని చేస్తున్నారని భయపడ్డాడు రాక్షసుడు.

క్రమక్రమంగా పడవకూ, తెప్పలకూ మధ్యనున్న దూరం తగ్గసాగింది. పులిందుడి అనుచరులు పడవ కేసి బండరాళ్ళు విసురుతూనే వున్నారు. ఇక పడవను పట్టుకోవటం క్షణాల మీద జరిగిపోతుంది అన్న ధైర్యంలో వున్నారు, ధూమకుడూ అతడి అనుచరులు. విరూపుడు ఎంతో ఉత్సాహంగా నల్ల గరుడపక్షిని సమీపించి చిటికెలు వేశాడు. అది తల వంచి బుసకొట్టుతున్నట్టు సన్నగా ఈల వేసింది.

"ఈ గరుడుణ్ణి కాస్త మాలిమి చేసుకుంటే, ఆ పొట్టిరాక్షసుడి తల భుజాల మించి ఎగిరిపోయేలా దీనిచేత దెబ్బ కొట్టించవచ్చు," అన్నాడు విరూపుడు. అంతలో భిల్లులు విసిరే రాళ్ళలో ఒకటి గురితప్పి వచ్చి విరూపుడున్న తెప్పకు తగిలింది. ఆ దెబ్బకు తెప్ప తలకిందులై పోయింది. విరూపుడూ, ధూమకుడూ, భిల్లులిద్దరూ నీళ్ళలో పడి తెప్ప తిరిగి నీటిపైకి లేవగానే దాని మీది కెక్కారు. గరుడపక్షి కూడా నీళ్ళల్లో పడి రెక్కలల్లల్లాడిస్తూ లేచి విరూపుడి భుజాల మీద వాలింది. విరూపుడు సంతోషంతో మైమరిచిపోయాడు.



హఠాత్తుగా నీటి వేగం హెచ్చింది. అంతే కాక నదిలో అక్కడక్కడా పెద్దపెద్ద గండ శిలలు కనిపించినై. పొట్టిరాక్షసుడు ఆ శిల లకు పడవ తగలకుండా నేర్పుగా దాన్ని నడుపుతున్నాడు. పులిందుడి అనుచరులు యింకా రాళ్ళు విసురుతూనే వున్నారు.

"ఈ సమీపంలోనే నది ఎత్తు నుంచి కిందికి జలపాతంలా దూకుతుందని నా అను మానం. అందువల్లనే నీటి ఉరవడి ఎక్కు వైంది. మనం తెప్పలను ఒడ్డు కేసి నడ పటం మంచిది," అన్నాడు విరూపుడు.

"ఆ రాక్షసుడి మాటేమిటి? నా చిన్న భార్య ఏం కాను?" అంటూ పులిందుడు ఆక్రోశించాడు.

"వాడూ యీ దాపులనే ఎక్కడో ఒడ్డు చేరక తప్పదు. లేకపోతే..." అంటూ విరూపుడు ఏమో చెప్పబోయేంతలో, పడవ నదిలో వున్న ఒక రాతికి తగిలి ఫెళఫెళ మంటూ పగిలి ఛిన్నాభిన్నమై పోయింది.

పొట్టిరాక్షసుడు నీటిలో దూకి యీదుతూ, పగిలిన పడవ నుంచి నదిలో పడి మునక లేస్తున్న ఒక స్త్రీని సమీపించి పట్టుకుని, భుజాన వేసుకుని వడివడిగా ఒడ్డు కేసి ఈదుకు పోసాగాడు.

"తెప్పల్ని త్వరగా ఒడ్డుకు నడపండి," అని ఆజ్ఞాపించాడు ధూమకుడు. భిల్లులు వాటిని ఒకటి రెండు నిమిషాల తరవాత ఒడ్డు చేర్చారు. కాని, పొట్టిరాక్షసుడు యీలోపల నీటి వాలున చాలా దూరం ఈదుకు పోయి, అక్కడ ఒడ్డు చేరాడు. ధూమకుడూ వాళ్ళూ వున్న చోటుకూ, రాక్షసుడున్న ప్రదేశానికీ మధ్య ఒక శిధిల మైన దేవాలయం వున్నది. దాని ఆవరణలో ఒత్తుగా పెరిగివున్న వృక్షాల మీద కొన్ని నరవానరాలూ, ఎలుగుబంట్లూ కొమ్మలను పట్టుకుని ఊగుతున్నవి. వాటిల్లో ఒక పెద్ద నరవానరం అరుస్తూ ధూమకుడూ వాళ్ళ కేసి రాసాగింది. —(ఇంకావుంది)






# నేరమూ-శిక్ష

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఎవరైనా శక్తికి మించిన పని సాధించ దలచినప్పుడు కనకవర్షుడి లాగా అమానుషశక్తి సహాయం పొంది తమ ఆశయాన్ని సిద్ధింప జేసుకోవాలి. శ్రమ తెలియకుండా నీకు కనకవర్షుడి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం గంగా తీరాన కనకపుర మనే నగరంలో ప్రియదర్శను డనే రాజుండే వాడు. అతను నాగరాజైన వాసుకి కుమారుడు. అతని భార్య యశోధర అనే మానవ స్త్రీ. కనకవర్షుడు వారి కుమారుడు. అతను త్రిలోకసుందరుడు. అతన్ని చూసి మోహించని స్త్రీ లేదు.

## బేతాళ కథలు



అతన్ని చూడకుండానే మోహించిన స్త్రీ మదనసుందరి. ఆమె విదర్భదేశంలోని కుండిననగర రాజు కూతురు. కనకవర్షుడి లాగానే ఆమె కూడా అతిలోకసుందరి. ఆమె రోలదేవు డనే గొప్ప చిత్రకారుణ్ణి బతిమాలి, అతని ద్వారా తన కోరికను కనకవర్షుడికి తెలపమని కనకపురానికి పంపింది. రోలదేవుడు మదనసుందరి చిత్తరువును తీసుకుపోయి కనకవర్షుడికి చూపాడు. వెంటనే కనకవర్షు డామెను మోహించాడు.

త్వరలోనే కనకవర్షుడికీ, మదనసుందరికీ వివాహం జరిగింది. కొంతకాలం గడిచింది. తనకు సంతానం లేదన్న బాధ



కనకవర్షుడికి పట్టుకున్నది. రామాయణంలో దశరథుడు పుత్రులు లేరన్న చింతతో బాధపడిన విషయం విన్నప్పుడు కనకవర్షుడి చింత మరింత అయింది. ఆ చింతతో ఒక రాత్రి అతను నిద్రపట్టక బాధపడుతూండగా అతని పడకటింటిలోకి ఒక అపరిచిత స్త్రీ ప్రవేశించింది. ఆమెను చూడగానే కనకవర్షుడికి గౌరవమూ, భక్తీ పుట్టుకొచ్చింది. అతను ఆమెకు నమస్కారం చేశాడు.

ఆ స్త్రీ అతన్ని దీవించి, "నాయనా, నేను నీ మేనత్తను. నీ తండ్రి అక్కను. వాసుకి కుమార్తెను. నా పేరు రత్నప్రభ. నేను ఎప్పుడూ అదృశ్యంగా ఉంటూ నిన్ను కాపాడుతున్నాను. నీ విచారం చూసి ఇప్పుడు నీకు కనపడ్డాను. ఏమిటి నీ విచారం?" అని అడిగింది.

"నేను చాలా ధన్యుణ్ణి. నాకున్న విచారమంతా కొడుకులు లేరనే," అన్నాడు కనకవర్షుడు.

"అందుకు నే నొక ఉపాయం చెబుతాను, చెయ్యి. నువు కుమారస్వామి పాదమూలానికి వెళ్ళి, ఆయనను ఆరాధించి, ప్రసన్నుణ్ణి చేసుకుని, ఆయన అనుగ్రహం వల్ల పుత్రసంతానం పొందు. నీకు భయంకర



మైన విఘ్నాలు కలుగుతాయి. అయినా భయపడకు. వాటికి తట్టుకునే శక్తిని నేను నీ కిస్తాను," అని చెప్పి రత్నప్రభ అంత ర్ధానమయింది.

కనకవర్షుడు మర్నాటి ఉదయమే తన రాజ్యాన్ని మంత్రులకు అప్పగించి, కుమార స్వామి ని అరాధించటానికి బయలుదేరి వెళ్ళాడు. ఆయన పాదమూలంలో తీవ్ర మైన తపస్సు ప్రారంభించాడు. కొంత కాలమయాక అతని మీద బలంగా ధార పడసాగింది. దాన్ని సహించే శక్తిని అత నికి రత్నప్రభ ఇచ్చింది. అతని తపస్సుకు విఘ్నం కలిగించమని కుమారస్వామి విఘ్నేశ్వరుణ్ణి పురమాయించాడు. రాజు నెత్తినపడే ధారలో విఘ్నేశ్వరుడు పాము విషం వదిలాడు. దానికి కూడా కనక వర్షుడు చలించకుండా రత్నప్రభ అతనికి శక్తి నిచ్చింది. అది చూసి వినాయకుడు ప్రత్యక్షంగా కనకవర్షుణ్ణి తన దంతంతో రొమ్ములో పొడవ నారంభించాడు. కనక వర్షుడు వినాయకుణ్ణి స్తోత్రం చేసి, మెప్పిం చాడు. వినాయకుడు దీవించి వెళ్ళి పోయాక, కుమారస్వామి ప్రత్యక్షమై, "రాజా, నీ ధీరత్వానికి మెచ్చాను. ఏం వరం కావాలో కోరుకో," అన్నాడు.




"దేవా, నా కొక కుమారుడు కలిగే టట్టు అనుగ్రహించు," అని కోరాడు కనకవర్షుడు.

"అలాగే, నీ కొక కుమారుడు కలుగు తాడు. వాడికి హిరణ్యవర్షు డని పేరు పెట్టుకో. ఒకసారి గర్భాలయంలోకి రా," అన్నాడు కుమారస్వామి, అతన్ని ప్రత్యే కంగా అనుగ్రహించగోరి.

తాను రాజుశరీరంలో ఉండి కుమార స్వామిని సమీపిస్తే ఆ స్వామికి ఆగ్రహం వస్తుందని, రత్నప్రభ రాజు గర్భాలయం లోకి పోతూండగా అతడి శరీరంలో నుంచి బయటికి వచ్చింది.



గర్భాలయంలోకి వచ్చిన కనకవర్షుడిలో తేజస్సు తరిగి ఉండటం చూసి, కుమారస్వామి నిజం తెలుసుకుని, కోపంతో, "నువ్వు మోసం చేశావు. అందుచేత నీకు పుట్టబోయే కొడుకుతోనూ, భార్యతోనూ ఏడాదిపాటు వియోగం అనుభవించు," అని అదృశ్యుడైపోయాడు.

కనకవర్షుడు తన నగరానికి తిరిగి వెళ్ళి, కాలక్రమాన మదనసుందరి యందు ఒక కొడుకును కన్నాడు. అతను తన కొడుక్కు హిరణ్యవర్షుడని పేరు పెట్టటమే గాక, తన ప్రజల మీద నిజంగానే హిరణ్యవర్షం కురిపించాడు.

పురిటింటికి ఆరోరోజున రక్షలన్నీ యథావిధిగా ఏర్పాటు చేశారు. అంతలోనే ఆకాశాన దట్టంగా మేఘాలు కమ్మి ధారాపాతంగా వర్షం సాగింది. చెట్లను పడగొట్టుతూ పెనుగాలి వీచింది. అటువంటి సమయంలో, గడియవేసి ఉన్న పురిటిగది తలుపులు తెరుచుకుని ఒక భయంకరాకారం గల స్త్రీ ప్రవేశించి, చంటిబిడ్డను ఎత్తుకుని, చూసేవారందరికీ దిగ్భ్రమ కలిగించి పారిపోయింది. "అయ్యో, నా బిడ్డ!" అంటూ బాలింతరాలు ఆ చీకటిలో ఆమె వెంట పరిగెత్తింది.

ఆ రాక్షసి పోయిపోయి అరణ్యంలోని ఒక సరస్సులో దూకింది. పుత్రమోహం కొద్దీ రాణి కూడా అందులో దూకింది.

వెంటనే మబ్బులూ, వానా, గాలీ, అన్నీ నిలిచిపోయాయి. మర్నాడు తెల్లవారి కనకవర్షుడు తన భార్యనూ, బిడ్డనూ చూసుకుందామని పురిటిగదికి వచ్చి, ఇద్దరూ లేకపోయేసరికి మూర్ఛపోయాడు. అది మొదలు అతను భార్యావియోగంతో వెర్రివాడు లాగా అయిపోయాడు. అతన్ని ఎవరూ ఓదార్చలేకపోయారు. అతను తన నగరాన్ని విడిచిపెట్టి, అడవులు పట్టిపోసాగాడు.

కనకవర్షుడు అనేక కష్టాలుపడి, అనేక అపాయాల నుంచి దైవికంగా తప్పించుకుని వింధ్యారణ్య ప్రాంత మంతా చెడతిరిగాడు. ఏడాది గడిచింది. రత్నప్రభ అకస్మాత్తుగా అతని ఎదట ప్రత్యక్షమై, "ఇదుగో నీ భార్యా పుత్రులు. నేనే వీరిని తీసుకుపోయి కాపాడి కుమారస్వామి శాపాన్ని పూర్తి చేశాను," అన్నది. కనకవర్షుడు పరమానందం చెంది తన భార్యనూ, కొడుకునూ తీసుకుని తన నగరానికి తిరిగి వచ్చి, సుఖంగా ఉన్నాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. కుమారస్వామి రాజును శపించ దలచినప్పుడు పుత్రవియోగం మాత్రమే కలిగించక భార్యావియోగం కూడా ఎందుకు కలిగించాడు? కొడుకును సంపాదించటం విషయంలోనే కద రాజు ఆ స్వామిని మోసం చేసింది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దేవతలు అనర్హులకు వరాలివ్వగోరరు. రాజుకు గల అర్హత తెలుసుకోవాలనే కుమారస్వామి విఘ్నేశ్వరుడి చేత పరీక్షలు పెట్టించాడు. రాజు ఆ పరీక్షలకు స్వశక్తితో తట్టుకోలేదని తెలిశాక, శాపం నెపాన మరికొన్ని పరీక్షలు కల్పించాడు. నిజాని కది శాపం అనే కన్న శిక్ష అనటం సమంజసం. అప్పుడే పుట్టిన కొడుకును దూరం చేస్తే రాజు కది శిక్ష కాదు. రాజు దౌర్బల్యానికి మూలం రాణి. ఆమెతో ఎడబాటే అతనికి నిజమైన శిక్ష. అది శిక్ష అని గ్రహించే రత్నప్రభ దానిని స్వయంగా తానే అమలు చేసింది. కుమారస్వామి ఆగ్రహానికి కారణభూతురాలు కూడా రత్నప్రభే గనక ఆమె ద్వారానే శిక్ష అమలు జరగటం సక్రమమైనది," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# మందమతి

ఒక ఏటి ఒడ్డున ఉండే గ్రామంలో రాయన్న అనే భూస్వామి ఉండేవాడు. ఆయన చాలా పెద్దమనిషి. గ్రామస్థులందరూ ఆయనను గౌరవించేవారు. గ్రామంలో ఏ తగాదా వచ్చినా ఆయనను తీర్పు కోరి, ఆయన చెప్పిన ప్రకారం తగాదా పరిష్కారం చేసుకునేవారు. రాయన్న కూడా ఒకరి జోలికి పోకుండా, తన పరువు నిలబెట్టుకుంటూ, సుఖంగా జీవయాత్ర సాగించాడు.

చాలా కాలంపాటు ఆయనకు ఒకటే కొరత ఉండేది. ఆయనకు బిడ్డలు లేరు. కొంత కాలమయాక ఆయనకు ఒక కొడుకు కలిగాడు. లేకలేక పుట్టిన ఆ కొడుక్కు వీరన్న అని పేరు పెట్టుకుని, అతిగారాబంగా పెంచసాగారు తల్లి దండ్రులు.

ఈ గారాబం బాగా తల కెక్కి వీరన్న చిన్నతనం నుంచీ బొత్తిగా ఆకతాయి అయి పోయాడు. ఇంటి వద్ద వాడు ఎంత అల్లరి చేసినా తల్లీ, తండ్రీ గట్టిగా కోప్పడేవారు కారు. మరీ పాడుపనులు చేస్తే, అలాటి పనులు చెయ్యవద్దని బతిమాలేవారు. లోక మంతా తనను అలాగే చూస్తుందను కున్నాడు వీరన్న. ఆ ఉద్దేశంతో వాడు ఊళ్ళో తన ఈడు పిల్లలందరి మీదా పెత్తనం చలాయించసాగాడు. ఎవరైనా వాడి పెత్తనాన్ని సహించకపోతే వాళ్ళను పట్టుకుని కొట్టేవాడు. రాయన్న మీది గౌరవం కొద్దీ ఊళ్ళో వాళ్ళు వీరన్న అగడాలు సహించే వాళ్ళు. ఆడవాళ్ళు మాత్రం వీరన్న తల్లి వద్దకు వచ్చి, "మీ వాడు మా పిల్లలను బతకనివ్వటం లేదు," అని ఫిర్యాదులు చేసేవాళ్ళు.

"పిల్లలన్నాక ఒక క్షణం కొట్టుకుంటారు మరో క్షణం మళ్ళీ ఏకమవుతారు. ఈ భాగ్యానికి ఫిర్యాదులు చెయ్యాలా?" అనేది వీరన్న తల్లి.

ఎ. లక్ష్మీదేవి

వీరన్నను బడిలో వేశారు, కాని వాడికి చదువు అంటలేదు. వాడి మకురుతనం మటుకు వృద్ధి అయింది. తినటమూ, తిరగటమూ తప్ప వేరే పని లేకపోవటం చేత వాడు చిన్న అంబోతులాగా తయారయాడు. ఊళ్ళో అందరికీ వాడంటే భయం భయంగా ఉండేది. వాడు ఏటి కట్ట మీద అంత దూరాన కనిపిస్తే ఆడపిల్లలు నీరు తీసుకునే ప్రయత్నంకూడా మానేసి వెనక్కు తిరిగి వెళ్లేవాళ్ళు.

రాయన్నకు తన కొడుకు నిజమైన స్వభావం తెలిసివచ్చిన కొద్దీ విచారం కూడా ఎక్కువయింది. మొక్కగా వంగనిది మానై వంగదు. ఇరవైఏళ్ళు పైబడ్డ వీరన్నను ఇప్పుడు సరి అయిన మార్గంలో పెట్టటం తేలిక కాదు. లేకలేక పుట్టిన ఒక్క కొడుకూ తన పరువు తీసేస్తూంటే, విచారించటం తప్ప రాయన్న ఇంకేమీ చెయ్యలేకపోయాడు.

అయితే తల్లీ తండ్రీ చెయ్యలేకపోయిన పనిని, ఆ గ్రామంలో ఉండే ఒక పేద రైతు కూతురు సాధించింది. ఆ పిల్లపేరు గౌరి. ఆమె ఎంత అందంగా ఉండేదో అంత తెలివిగలదీ, మాటకారీ కూడానూ. ఆమె వీరన్నను చూసి ఎన్నడూ భయపడి ఎరగదు. ఆమె అందమూ ధైర్యమూ చూసి వీరన్నకు ఆ పిల్లను పెళ్ళాడాలని మనసయింది. ఆ సంగతి గౌరి తేలికగా పసికట్టింది. వీరన్న తనను పెళ్ళాడతానని అన్నరోజున అతనికి మంచి గుణపాఠం నేర్పటానికి కూడా ఆమె ఒక ఉపాయం ఆలోచించి పెట్టింది.



వీరన్నకు గౌరి పైన మనసుగా ఉన్నదని గౌరి స్నేహితురాళ్ళకు తెలుసు. వేసవి ఆరంభంలో ఒకనాడు ఇంటి ముందు అరుగు మీద గౌరీ, స్నేహితురాళ్ళూ కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉండగా, వాళ్ళింటి ముందుగా వీరన్న వచ్చాడు.



వీరన్నకు వినపడేటట్టుగా ఒక స్నేహితు రాలు, "అయితే, గౌరీ, నీ పెళ్ళి ఎప్పుడే?" అని అడిగింది.

"నా పెళ్ళి అంత తేలికగా అవుతుం దనుకున్నావా? నన్ను పెళ్ళాడేవాడు నేను పెట్టే పరీక్షలకు నిలబడాలి," అన్నది గౌరి.

ఈ మాటలు వింటూ ముందుకు సాగి పోయిన వీరన్నకు రోషం వచ్చింది. తాను గౌరిని పెళ్ళాడాలనే ఉద్దేశంతో ఉన్నాడు గనక ఆమె తననే సవాలు చేస్తున్నట్టు అభిప్రాయపడ్డాడు. గౌరి ఏమి పరీక్షలు పెట్టుతుందో తెలుసుకునే దాకా అతని ప్రాణం గిలగిలా కొట్టుకోసాగింది. అందు చేత మరికొంత సేపయాక మళ్ళీ గౌరి ఇంటి కేసి వచ్చాడు.

"ఏం, వీరన్నా, ఇలా వచ్చావు? మా నాన్న ఇంట్లో లేడు," అన్నది గౌరి.

"నేను నీ కోసమే వచ్చాను. నిన్ను పెళ్ళి చేసుకునేవాడి కేవో పరీక్షలు పెడతా వటగా? ఏమిటా పరీక్షలు?" అని వీరన్న దర్పంగా అడిగాడు.

"వాటితో నీకేం పని? నేను పరీక్షలు పెట్టేది నన్ను పెళ్ళాడతానని వచ్చేవాడికి," అన్నది గౌరి.

"నిన్ను పెళ్ళాడదామనే అడుగుతున్నా ననుకోరాదా?" అన్నాడు వీరన్న.

"పరీక్షల్లో నెగ్గకపోతే జన్మంతా నాకు పనిమనిషిగా ఉండాలిసుంటుంది. నీకా పరీక్షలు వద్దులే," అన్నది గౌరి.

"నీ పరీక్షల్లో నెగ్గటం నా వల్లే కాకపోతే, నన్ను మించిన మొనగాడున్నాడా?" అన్నాడు వీరన్న పౌరుషం వచ్చి.

"అదీ నిజమే ననుకో. అయితే నేను చెప్పిన షరతు జ్ఞాపకం ఉంచుకో. నేను నీకు బరువైన పనులేమీ చెప్పను," అన్నది గౌరి.

"ఆ పనులేవో చెప్పు," అన్నాడు వీరన్న ధీమాగా.



"మొదటి పని చెబుతాను, నా వెంట రా," అంటూ గౌరి ఒక బిందే, చిన్న గిన్నే తీసుకుని ఏటికి దారి తీసింది. వీరన్న ఆమె వెంట వెళ్ళాడు.

ఏటి ఇసుకలో ఒక చెలమ గుంట తీయమన్నది గౌరి, వీరన్న తేలికగా గుంట తీశాడు. అందులోకి నీరు వచ్చింది.

"ఈ నీరు బాగాలేదు. గిన్నెతో దీన్ని తీసేసి గుంట ఖాళీచెయ్యి. తరవాత వచ్చే నీరు బిందెలో నింపుకుంటాను," అన్నది గౌరి.

వీరన్న చెలమలోని నీరు గిన్నెతో తోడెయ్యసాగాడు. ఎంతసేపు నీరు తీసినా గుంటలోని నీరు తరగనేలేదు. ఒక గంట గడిచింది. వీరన్నకు చేతులు పడిపోతున్నాయి, ముచ్చెమటలు పట్టుతున్నాయి.

"ఇంకా గుంట ఖాళీ కాలేదా?" అన్నది గౌరి విసుగ్గా.

"ఇక నా వల్లకాదు," అంటూ వీరన్న గిన్నె అవతల పడేశాడు.

"ఓడిపోయావు! మొదటి పరీక్షకే నిలవలేకపోయావు! ఏం చేసేటట్టు? పోనీ మిగిలిన పరీక్షల్లోనన్నా నెగ్గుతావేమో చూద్దాం," అంటూ గౌరి వీరన్నను తన ఇంటికి తీసుకుపోయింది. గౌరి స్నేహితురాళ్ళు వీరన్నను చూసి ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు.

గౌరి ఇంట్లోకి పోయి ఒక పళ్ళెంలో నిప్పు, ఒక డబ్బా, ఇంత సాంబ్రాణీ తెచ్చి, "ఈ సాంబ్రాణిని నిప్పుల మీద వేసి పొగ చేసి, ఈ డబ్బాలో పట్టి ఉంచు. నే నిప్పుడే తలంటి నీళ్ళు పోసుకుని వచ్చి తలకు సాంబ్రాణి పొగ వేసుకుంటాను," అన్నది.

మందమతి అయిన వీరన్న నిప్పుల మీద సాంబ్రాణి వేసి, దానిపైన డబ్బా బోర్లించాడు. గౌరి తడితలతో వచ్చి, "సాంబ్రాణి పొగ సిద్ధంచేశావా?" అని అడిగింది.

వీరన్న "ఇదుగో!" అంటూ డబ్బా తిరగ దీశాడు. కాని అందులో ఏమీలేదు. పొగ అంతా అప్పుడే పోయింది.

"ఇంత చిన్నపని కూడా చెయ్యలేక, రెండోసారి కూడా ఓడిపోయావు. మూడో పని అయినా సరిగా చేస్తావేమో చూస్తాను," అన్నది గౌరి. ఆమె స్నేహితురాళ్ళు కొంచెం గట్టిగానే నవ్వుతున్నారు. వీరన్నకు పరాభవంతో ప్రాణం చచ్చిపోతున్నది.

గౌరి లోపలికి వెళ్ళి చెంబులో పాలు తెచ్చి, "ఇందులో సగానికి సగం నీరు కలిసింది. నాకు నీళ్ళపాలు సహించవు. కాస్త యీ పాలలోని నీరు తీసేసి చిక్కటి పాలు వేరుచెయ్యి," అన్నది.

వీరన్నకు ఏం చెయ్యాలో తెలియలేదు, అతనికిప్పుడు అవమానంతో బాటు దుఃఖం కూడా వచ్చేస్తున్నది.

"ఈ పని నా వల్ల కాదు," అంటూ వీరన్న వెళ్ళిపోవటానికి లేచాడు.

"ఎక్కడికి పోతున్నావు? నేను పెట్టిన పరీక్ష లన్నిటా ఓడావు. నువ్విప్పుడు నా పనిమనిషివి. నాతో చెప్పకుండా ఏమీ చెయ్యరాదు, నేను చెప్పిన పనులన్నీ చేసి తీరాలి," అన్నది గౌరి.

గౌరి స్నేహితురాళ్ళు కసికొద్దీ వీరన్నను నానామాటలూ అనటం మొదలుపెట్టారు: "అపగింజంత ప్రపంచజ్ఞానం లేదు. అతిశయం మాత్రం చుక్క లంటుతుంది. చాతావాతా కానివాడికి ఎంత పొగరు! ఈ ముష్టి ప్రయోజకత్వంతో గౌరిని పెళ్ళాడతాడట! దున్నపోతులాగా కండలు పెంచగానే సరా? కాస్త బుద్ధికూడా ఉండవద్దూ?"

ఆడపిల్లల కేకలకు అందరూ పోగయ్యారు. గౌరి వీరన్నకు తగినట్టు బుద్ధి చెప్పిందని ఊరంతా క్షణంలో పాక్కిపోయింది, అందరూ సంతోషించారు. అందరికన్నా ఎక్కువ సంతోషించినవాడు రాయన్న. ఎందుకంటే గౌరి నేర్పిన గుణపాఠంతో వీరన్న పూర్తిగా మారిపోయాడు. ఆయన గౌరి తండ్రితో మాట్లాడి గౌరినే తన కోడలుగా చేసుకున్నాడు.





# మణిద్వీపం

ఒకప్పుడు కొందరు వర్తకులు ఒక ఓడ చేసుకుని తూర్పుదీవులకు వెళ్ళి, అక్కడ వర్తకం చేసుకుని తిరిగి వచ్చేటప్పుడు శ్వేత ద్వీపంలో వారి వెంట ఒక సింహళదేశపు యువకుడు కూడా ఓడలో ఎక్కాడు.

ఓడ నడి సముద్రంలో ఉండగా అకస్మాత్తుగా ఒక భయంకరమైన తుఫాను చెలరేగింది. అలలు ఆకాశమంత ఎత్తు లేచి, ఓడను బెండును ఆడించినట్టు ఆడించాయి. చుక్కాని విరిగిపోయింది. ఓడకూ, అందులో ఉన్నవాళ్ళకూ అవసానకాలం సమీపించినట్టు కనబడింది. గాలికి ఓడ ఎటుగా పోతున్నదీ తెలియరాలేదు. తెలిసినా చేసేదికూడా లేదు. ఎందుకంటే, దాన్ని కావలిసిన దిక్కుగా పోయేటట్టు చెయ్యటానికి చుక్కాని లేదు.

ఈవిధంగా ఒక పగలూ, ఒక రాత్రీ సముద్రం మీద కొట్టుకుపోయిన ఓడ మర్నాడు తెల్లవారేసరికి సముద్రం మధ్య నున్న ఒక కొండ కేసి పోవటం అందరి కళ్ళా పడింది. కొద్ది ఘడియలలో ఓడ దాని కేసి కొట్టుకుని తునాతునకలయిపోవటానికి సిద్ధంగా ఉంది. అందరూ ప్రాణాల మీద ఆశ వదులుకున్నారు.

ఇంతలో నావికులపెద్ద, "ఆ ఎదురుగా కనిపించేది మణిద్వీపం! ఆ కొండరాళ్ళలో ఉన్నన్ని మణులు ప్రపంచమంతటా కలిపినా లేవు," అన్నాడు.

అందరిలోనూ తిరిగి ఆశ తల ఎత్తింది. ఒక్క సింహళంవాడు మాత్రం, "ఓడ పగిలి మునిగిపోవటానికి మామూలు కొండ రాళ్ళయితే నేం? మాణిక్యాల రాళ్ళయితే నేం?" అన్నాడు.

కాని ఓడ మణిద్వీపానికి ఒక మైలు దూరంలో ఉండగానే గాలి కాస్తా నిలిచి పోయింది. ఓడను తీరానికి చేర్చే మార్గం

జి. శంకరరావు



లేదు. తీరాన రేవు కూడా లేదు. అందుచేత ఓడ నుంచి కొన్ని తెప్పలు దించి, ఓడలో వాళ్ళంతా తీరానికి ప్రయాణమయారు.

సింహళీయుడు మాత్రం ఓడ నుంచి దిగలేదు; "రత్నాలన్నీ మీరే ఉంచుకోండి. నేను మా తామ్రపర్ణి నగరానికి వెళ్ళాలి. ఈ ఓడ నన్ను తప్పక మా ఊరు చేర్చుతుంది. ఇందులోనుంచి దిగను," అనేశాడు. అతన్ని వదిలేసి మిగతా వాళ్ళంతా తెప్పలను తెడ్లతో నడుపుకుంటూ తీరం కేసి వెళ్ళిపోయారు.

తీరం చేరగానే నావికులపెద్ద మిగిలిన వాళ్ళతో ఇలా అన్నాడు:

"ఈ లంకలో ఉండేవాళ్ళు మరుగుజ్జులు. కోపం వస్తే వాళ్ళంత చెడ్డవాళ్ళు లేరు; విషపు బాణాలతో కొట్టి చంపేస్తారు. కాని మంచిగా ఉంటే ప్రాణాలిచ్చేస్తారు. అందుచేత వాళ్ళతో జాగ్రత్తగా మసులుకోవటం అవసరం. ఆ కనిపించే కొండ నిండా రాళ్ళలో రత్నాలున్నాయి. దాని దిగువనే మరుగుజ్జులుండే నగరం ఉన్నది. కొండ అన్నిపక్కలా నిటారుగా ఉంటుంది. దాన్ని ఎక్కటం అసాధ్యం. దానిపైకి వెళ్ళటానికి మెట్లున్నాయి. ఆ మెట్లను చేరాలంటే నగరంలో నుంచే వెళ్ళాలి. మెట్ల మార్గానికి మరుగుజ్జులు అహోరాత్రాలు కాపలా కాస్తారు. అందుచేత మరుగుజ్జులను మంచిచేసుకోకుండా మనం ఏమీ సాధించలేం."

నావికులపెద్ద ఈ విధంగా చెప్పాక, అందరూ కలిసి కొండ కేసి కదిలారు. కొంత దూరం వెళ్ళాక నగరం కనబడింది. వాళ్ళింకా నగరానికి కొంతదూరంలో ఉండగానే వారి మీదికి బాణాలు వచ్చాయి. అదృష్టంకొద్దీ అవి ఎవరికీ తగలలేదు.

"అందరూ ఇక్కడే కూర్చోండి. లేకపోతే మనం తమ మీదికి యుద్ధానికి వస్తున్నామని వాళ్ళు అపోహపడగలరు,"

అన్నాడు నావికులపెద్ద. అందరూ వున్న చోటనే చతికిల బడ్డారు.

కొద్దిసేపటిలో కొందరు మరుగుజ్జు భటులు ఆయుధాలు చేతబట్టి నగరం వెలువడి వచ్చారు. భటుల వెంట ఉన్న సరదారు, "ఎవరు మీరు? ఈ లంకకు ఎందుకు వచ్చారు?" అని అడిగాడు.

"మా ఓడ తుఫానులో దెబ్బతిన్నది. సహాయం కోసం వచ్చాం," అన్నాడు నావికులపెద్ద.

"మీ కళ్ళకు గంతలు కట్టి తీసుకుపోయి మా రాజుగారి ముందు పెడతాము. మీరు చెప్పుకునేదంతా ఆయనకు చెప్పుకోండి," అని మరుగుజ్జు భటులు అన్నారు. అందుకు అందరూ ఒప్పుకున్నారు. మరుగుజ్జులు వర్తకులనూ, నావికులనూ గంతలు కట్టి, చేతులకు బందాలు వేసి నగరంలోకి తీసుకుపోయి, రాజుగారి ఎదట హాజరుపెట్టారు.

"మీరు చెప్పే తుఫాను సంగతి మాకేమీ తెలియదు. మీరు వచ్చిన దిక్కుగా సముద్రంలో మీ ఓడ ఏమీ కనిపించలేదని మా వాళ్ళు చెబుతున్నారు. ఈ లంకలో అడుగుపెట్టిన వారెవరూ తిరిగి పోరని మీకు తెలిసే ఉంటుంది. మీరేదో దురుద్దేశంతో ఇక్కడికి వచ్చారనటానికి సందేహంలేదు.



ప్రస్తుతానికి మిమ్మల్ని ఖైదులో ఉంచుతాం," అన్నాడు రాజు.

భటులు వాళ్ళను తమ కారాగృహంలో బంధించారు. అవి మరుగుజ్జుల కోసం కట్టినవి కావటంచేత వర్తకులకూ, వారి వెంట ఉన్నవారికీ చాలా ఇరుకనిపించాయి.

వర్తకుల ఓడ మరుగుజ్జులకు కనిపించని మాట నిజమే. ఎందుచేతనంటే లంక చుట్టూ సముద్రంలో ఒక ప్రవాహం ఉన్నది. అది ఓడను క్రమంగా లంక అవతలి పక్కకు చేర్చింది. అక్కడనే మంచి రేవు కూడా ఉన్నది. ఆ రేవులోకి వచ్చి ఓడ తీరం చెంతనే నిలిచింది.



మిగిలిన వాళ్ళంతా తెప్పలలో లంక మీదికి వెళ్ళిపోయాక సింహళీయుడు నిశ్చింతగా పడుకుని నిద్రపోయాడు. అతను తిరిగి నిద్ర లేచేసరికి నౌక రేవులో ఉండటం కనబడింది.

"తామ్రపర్ణి వచ్చేసిందా?" అంటూ సింహళీయుడు నౌక నుంచి దిగి తీరానికి వచ్చేశాడు. రేవులో ఎవరూ లేరు. సమీపంలోనే కొండ ఒకటి ఉన్నది. అతను దాని పక్కగా నడవనారంభించాడు. అతను కొంతదూరం వెళ్ళాక ఇద్దరు మరుగుజ్జులు గోలీ లాడుతూ కనిపించారు. సాయంకాలపు ఎండలో ఆ గోలీలు ధగధగా మెరిశాయి. వాటి తళతళ చూసి సింహళీయుడు ఆశ్చర్యపోయాడు, కాని అవి రత్నాలయి ఉంటాయని అతనికి తట్టలేదు.

సింహళీయుణ్ణి చూడగానే మరుగుజ్జులు, "అమ్మయ్యో, రాక్షసుడు!" అంటూ పారిపోబోయారు. కాని అతను వాళ్ళను పట్టుకుని ఆపి, "నేనూ, మీవంటి మనిషినే! కొంచెం లావూ, ఎత్తూ—అంతే! నాకు చచ్చే ఆకలిగా ఉంది! ముందు తినటానికేదైనా కావాలి," అన్నాడు.

మరుగుజ్జులు అతణ్ణి తమ ఇంటికి తీసుకుపోయారు. దారిలో వాళ్ళు, "నీ వంటి రాక్షసులను కొందరిని మా రాజుగారు కొట్లో పెట్టించారు," అని చెప్పారు.

"పాపం, వాళ్ళు ఓడలో నాతో వచ్చిన వాళ్ళే అయి ఉంటారు. ఎలాగైనా వాళ్ళను ఖైదు నుంచి విడిపించాలి," అనుకున్నాడు సింహళీయుడు.

మరుగుజ్జులు అతన్ని తమ ఇంటికి తీసుకుపోయారు. ఒంటరిగాడు గనక అతని కోసం భటులు రాలేదు గాని, మామూలు వాళ్ళు అతన్ని ఎంతగానో పరీక్ష చేశారు. ఈ రాక్షసుడు మాణిక్యాలేవీ తీసుకోలేదు. ఆఖరుకు గోలీలు కూడా ఆడుకునే మరుగుజ్జు పిల్లల దగ్గిరే ఉన్నాయి.



అందుచేత అతని పట్ల అందరూ స్నేహ భావం ప్రకటించారు. అతనికి కడుపునిండా తిండి పెట్టారు. అతనుకూడా పాటలు పాడీ, కథలు చెప్పి వాళ్ళను ఆనందింప జేశాడు.

మర్నాడు ఉదయం సింహళీయుడు తన మిత్రులైన మరుగుజ్జు పిల్లలతో, "నాకు మీ రాజుగారిని ఒక్కసారి చూడాలని ఉన్నది," అన్నాడు.

"అయితే ఇప్పుడే పోదాం. రాజుగారు తోటలో ఉంటాడు," అన్నారు వాళ్ళు.

ఇద్దరినీ చెరొక భుజానా ఎక్కించుకుని సింహళీయుడు రాజోద్యానానికి వెళ్ళాడు.

"అదుగో, ఆ రాతి పలక పైన కూర్చున్న వాడే మా రాజుగారు. మమ్మల్ని దింపెయ్యి. రాజుగారు చూస్తే మమ్మల్ని దండిస్తారు," అంటూ, మరుగుజ్జు పిల్లలు ఆందోళన పడ్డారు. సింహళీయుడు వాళ్ళను దింపి, నాలుగు అంగల్లో రాజు కూర్చున్న చోటికి వెళ్ళి, అతన్ని నడుము పటుకుని పైకెత్తాడు. రాజు కీచుగా భయంతో కేకపెట్టాడు. ఆ కేక విని అన్ని పక్కల నుంచీ విషపుబాణాలు గల భటులు పరిగెత్తుకుంటూ వచ్చారు.

"వాళ్ళు నన్నేమైనా చేశారో, నిన్ను నలిపి పారేస్తాను. వాళ్ళను ముందు దూరంగా ఉండమను," అన్నాడు సింహ



ళీయుడు రాజుతో. దూరం పొమ్మని రాజు తన భటులకు కేకపెట్టాడు.

"నా స్నేహితులను ఖైదులో పెట్టించావుట. వాళ్ళను ముందు విడిపించు. వాళ్ళు నీకేమి అపకారం చేశారు? వాళ్ళను వెంటనే విడిపించక పోయావో ఈ లంకకు మరొక రాజును ఏర్పాటు చేస్తాను," అన్నాడు సింహళీయుడు.

"నీ యిష్టప్రకారం చేస్తాను. నన్ను ముందు దించు," అన్నాడు రాజు. సింహళీయుడు రాజును కిందపెట్టాడు.

రాజు తన భటులను పిలిచి, రాక్షసులను ఖైదు నుంచి విడిపించి తీసుకు



రమ్మని ఉత్తరు విచ్చాడు. కొంతసేపటికి ఓడ తాలూకు మనుషులంతా భటుల వెంట అక్కడికి వచ్చారు. సింహళీయుణ్ణి చూడ గానే వాళ్ళకు ప్రాణం లేచివచ్చింది.

"వీళ్ళు అబద్ధం చెప్పారు. తుఫాను వచ్చిందన్నారు. తమ ఓడ సముద్రంలో కదలలేని స్థితిలో ఉన్నదన్నారు. ఆ మాటలు నమ్మదగినవి కాదు. అందుచేత నాకు వాళ్ళపైన అనుమానం కలిగి ఖైదులో పెట్టించాను," అన్నాడు రాజు సింహళీయుడితో.

"అందులో అబద్ధం ఏమీలేదు. మా ఓడ చుక్కాని విరిగి రేవులో ఉన్నది. మేము దానికి కొత్త చుక్కాని ఏర్పాటు చేసుకునే దాకా మమ్మల్ని ఇక్కడ ఉండనిస్తే, తరవాత మా దారిన మేము పోతాం," అన్నాడు సింహళీయుడు. రాజు అందుకు సమ్మతించాడు.

ఒక్కరోజులో ఓడకు కొత్త చుక్కాని ఏర్పాటయింది.

"ఇక మనం బయలుదేరుదాం," అన్నాడు సింహళీయుడు.

"రత్నాలు తీసుకోకుండా ఎలా పోతాం?" అన్నారు మిగిలినవాళ్ళు.

సింహళీయుడు తన మిత్రులైన మరుగుజ్జు పిల్లలను పిలిచి, "మాకు కూడా గోలీ లాడుకోవాలని ఉన్నది. మీరు మీ స్నేహితులను కొందరిని వెంట పెట్టుకుని కొండ మీదికి వెళ్ళి పెద్ద పెద్ద గోలీరాళ్ళు పట్టుకురండి. మాకు చిన్న చిన్న గోలీలు చాలవు. అందుచేత పెద్ద పెద్ద గోలీరాళ్ళు తీసుకురండి. తరవాత వాటిని మేము గోలీలుగా తయారు చేసుకుంటాం," అన్నాడు.

సాయంకాలాని కల్లా పది పన్నెండుమంది మరుగుజ్జు పిల్లలు పెద్ద పెద్ద ముడి మణులను తెచ్చి సింహళీయుడి ముందు పెట్టారు. సింహళీయుడు వాటిని తన మిత్రులందరికీ పంచాడు. తరవాత వాళ్ళు ఓడ ఎక్కి ప్రయాణం సాగించారు.





# భర్తతెలివి-భార్యతెలివి

ఒక అరణ్యానికి దగ్గిరలో నూకాలమ్మ అనే మనిషి ఒంటరిగా జీవిస్తూ ఉండేది. ఆమెకు బంధువులైనవా రెవరూ లేరు. పెళ్ళి కూడా కాలేదు. కాని నూకాలమ్మ గొడ్డూ గోదా ఏర్పాటు చేసుకుని, పాడి మీద డబ్బు కొంత వెనకవేసి, ఒంటరి బతుకే అయినా సుఖంగా బతుకుతూ వచ్చింది.

అడవిలో ఒక కోయకుటుంబం ఉండేది. అది సమిష్టి కుటుంబం. అందులో ముప్పై, నలభై మంది ఆడా మగా ఉండేవారు. వాళ్ళు అడవిలో కొంత మేర మోటు ధాన్యాలు పండించి, వాటితో పొట్టపోసుకునే వారు. ఒకనాడు కోయపెద్ద వచ్చి, "నూకాలమ్మా, నూకాలమ్మా, ఇరవై రూపాయ లుంటే అరువిస్తావా? ఏడాది లోపల వడ్డీతో సహా తిరిగి ఇస్తాను," అన్నాడు.

"పిడతలో ఉండే డబ్బు పిల్లలను పెడుతుందా?" అనుకుని నూకాలమ్మ కోయపెద్దకు ఇరవై రూపాయలు అప్పు పెట్టింది. ఏడాది గడిచింది. రెండో ఏడు కూడా సగపడ్డది. కోయపెద్ద డబ్బు తిరిగి ఇవ్వలేదు సరేకదా, తన ముఖమైనా చూపించలేదు. నూకాలమ్మ ఏదైనా సహిస్తుంది గాని మోసం సహించలేదు.

అందుచేత ఆమె ఒకనాడు తీరిక చేసుకుని, అడవిలో కోయకుటుంబం ఉండే చోటికి వెళ్ళింది. ఆమె వెళ్ళేసరికి కోయ కుటుంబంలోని యావన్మందీ తమ మొరటుధాన్యం కోస్తున్నారు. వారిలో కోయ పెద్దలాటి వాళ్ళు అయిదారుగురున్నారు. వాళ్ళలో తన వద్ద అప్పు పుచ్చుకున్నవా డెవడో నూకాలమ్మ గుర్తించలేక, వాళ్ళు తనను చూడక ముందే, గిరుక్కున తిరిగి ఇంటిదారి పట్టింది.

దారిలో ఆమెకు పోతరాయు డనే వాడు కనిపించి, "ఏం, నూకాలమ్మా? అడివి

పి. శేషశాయి

నుంచి వస్తున్నావు, అక్కడేం పనిబడింది?'' అని పలకరించాడు.

పోతరాయుడు అడవి మనిషీకాదు, పల్లె మనిషీకాదు. వాడు ఎక్కడబడితే అక్కడ తిరుగుతూ, ఏదోవిధంగా పొట్టపోసుకుంటూ, గాలికి తిరిగేవాడు. చాలా తెలివిగలవాడని అందరూ చెప్పుకునేవారు.

నూకాలమ్మ తన మనసు తేలిక చేసుకుందామని, దాచకుండా వాడితో జరిగినదంతా చెప్పింది.

పోతరాయుడు నవ్వి, ''అవును, ఆ కోయ వాళ్ళంతా కొత్తవాళ్ళకు ఒకటిగానే ఉంటారు. నేను చెప్పినట్టు చేస్తివా, నీకు పని జరుగుతుంది. ఇవాళ కోసిన పైరు రేపు నలుస్తారు. అప్పుడు నువు వెళ్ళి, ''ఎట్టాగైనా, పెద్ద పెద్దే! ఆ బలం మిగిలిన వాళ్ళ కెక్కడుంటుంది?' అను,'' అని సలహా ఇచ్చాడు.

నూకాలమ్మ మర్నాడు మళ్ళీ కోయ కుటుంబం ఉండే చోటికి వెళ్ళింది. మగవాళ్ళు కోసిన పైరును కట్టలు కట్టి, కట్టలను రాళ్ళ కేసి కొట్టి గింజరాలుస్తున్నారు. ఆడవాళ్ళు రాలిన గింజలను చెరిగి, తప్పాలూ వేరు చేస్తున్నారు.

నూకాలమ్మ మగవాళ్ళు గింజ రాల్చే చోటికి వెళ్ళి, కాస్సేపు చూసి, ''ఎట్టాగైనా



పెద్ద పెద్దే! ఆ బలం మిగిలిన వాళ్ళకు రమ్మంటే మటుకు వస్తుందా?" అన్నది.

వెంటనే కోయపెద్ద చేతిలో ఉన్న కట్టను కింద పడేసి, ఒక్క దూకుతో నూకాలమ్మ దగ్గిరికి వచ్చిపడి, "ఇప్పుడేం చూసినావు, నూకాలమ్మా? నా చిన్నతనంలో ఇంత పైరూ ఒక్క చేతిమీదిగా నలిచి పారేసే వాణ్ణి," అన్నాడు.

"నీ ప్రయోజకత్వం బాకీలు తీర్చటంలో కనిపించదేం? నా దగ్గిర తీసుకున్న డబ్బు ఇంతకాలం ఉంచుకున్నావేం?" అన్నది నూకాలమ్మ.

తన బలగం మధ్య కోయపెద్దకు తల తీసేసినట్టయింది. వాడు సిగ్గుపడుతూ, "ఎన్నింటికని చావను, నూకాలమ్మా? డబ్బు సిద్ధంగానే ఉంది. ఎప్పటికప్పుడు మీ ఇంటికి వద్దామనుకోవటమూ, ఏదో పని అడ్డురావటమూ అయిపోయింది," అంటూ లోపలికి వెళ్ళి, ముప్పై రూపాయలు తెచ్చి నూకాలమ్మ చేతిలో పెట్టాడు.

నూకాలమ్మ ఆ డబ్బు తీసుకుని సంతోషంగా ఇంటిదారి పట్టింది. పోతరాయుడు మళ్ళీ దారిలో కనిపించాడు. నూకాలమ్మ వాడితో జరిగిన సంగతి చెప్పి, వాడు చెప్పిన యుక్తిని ప్రశంసించింది.



"యుక్తులకేం? నా బుర్రనిండా యుక్తులే! ఇంకో యుక్తి చెప్పనా? మీ యింటికెళ్ళే దారిలో చిన్న రొంపి ఉన్నది, చూడూ. దానినిండా బురదమట్టలున్నాయి. అది దాటి వెళ్ళితే పొలాలలో పనిచేసుకునే మనుషులు కనిపిస్తారు. నువు ఇంటికి వెళ్ళి డబ్బు దాచిపెట్టి, ఆ పొలాల్లో పనిచేసే వాళ్ళ దగ్గిరికి వెళ్ళి, నీ డబ్బు మూట ఆ రొంపిలో పడిపోయిందని చెప్పు. దాన్ని తీస్తే సగం డబ్బు ఇస్తానని చెప్పు. వాళ్ళు రొంపి నుంచి బురద అంతా పైకి తోడేస్తారు. అందులో ఉండే చేపలు ఏరుకుని ఇంటికి చక్కాపో," అన్నాడు పోతరాయుడు.

నూకాలమ్మ అలాగే చేసింది. పొలాల్లో పనిచేసేవాళ్ళు వచ్చి రొంపి గుంట నుంచి బురద తీసి ఒడ్డున వెయ్యసాగారు. అందులో ఉండే చేపలను పుష్కలంగా ఏరి ఒడిలో పెట్టుకుని నూకాలమ్మ, "నే నిక్కడ నిల బడలేను. ఇంటి దగ్గిర నా ఎత్తు పని ఉంది. డబ్బుమూట దొరికితే సగం నాకు తెచ్చి ఇచ్చి మిగతాది మీరు పంచుకోండి," అని చెప్పి ఇంటికి వెళ్ళిపోయింది.

ఇది జరిగాక రెండు మూడు రోజులాగి పోతరాయుడు, తనను పెళ్ళాడమని నూకాలమ్మకు ఒక మనిషి ద్వారా రాయబారం పంపాడు. నూకాలమ్మ కూడా, ఆపాటి యుక్తి గలవాడు ఆధారంగా ఉండటం తనకు మంచిదేననీ, వాడు చిన్న మెత్తు పని చేయకుండా తింటూ కూర్చున్నా తాను సులువుగా పోషించవచ్చుననీ అనుకుని పోతరాయుణ్ణి పెళ్ళాడటానికి ఒప్పుకున్నది.

ఇద్దరికీ పెళ్ళి జరిగింది. పోతరాయుడి కిప్పుడు జీవితం మరింత హాయిగా ఉన్నది. నూకాలమ్మ మొగుణ్ణి కాల్చుకు తినేరకం కాదు. అస్తమానమూ ఇంటి పనులతోనే ఆమెకు సరిపోతుంది. ఆమెకు నాలుగు పాడి ఆవులున్నాయి. అడవిలో వాటికి బల మైన మేత దొరుకుతుంది. పుష్కలంగా పాలిస్తాయి. ఆ పాల నుంచి బోలెడంత



వెన్న వస్తుంది. వారాని కొకసారి నూకా లమ్మ దాన్ని బస్తీకి తీసుకుపోయి, అమ్మి, డబ్బు తెస్తుంది.

ఒకసారి నూకాలమ్మ మూడు పెద్ద చట్టీలనిండా వెన్న నించి, వాటిని దొంతరగా పేర్చి, తాళ్ళుపెట్టి కట్టి, మర్నాడు ఉదయం బస్తీకి తీసుకెళ్ళటానికి సిద్ధపరిచింది.

ఆ సాయంకాలం ఆమె ఏదో పనిమీద బయటికి వెళ్ళినప్పుడు పోతరాయుడికి వెన్న మీద బుద్ధి మళ్ళింది. వాడు చట్టీల దొంతర కట్లు విప్పి, అడుగు చట్టీలో నుంచి వెన్న తినసాగాడు. ఎంత తిన్నా వాడికి తృప్తి కాలేదు. చట్టీ అంతా ఖాళీచేశాడు. రెండో చట్టీలోది తినటం ఆరంభించి అది కూడా పూర్తిగా ఖాళీచేశాడు.

ఆ తరవాత వాడు ఖాళీచట్టీల నిండా ఇంత తడిమట్టి నింపి, మట్టిచట్టీల మీద వెన్న ఉన్న మూడోచట్టీ పెట్టి దొంతరగా పేర్చి, తిరిగి తాడుకట్టి, ఏమీ ఎరగనట్టు ఊరుకున్నాడు.

మర్నాడు నూకాలమ్మ బస్తీకి వెళ్ళే టప్పుడు వాడే ఆ చట్టీల దొంతరను ఆమె నెత్తికెత్తాడు. నూకాలమ్మ బస్తీకి వెళ్ళి వెన్న కొనేవాళ్ళ దగ్గిర దొంతర విప్పి, పై చట్టీ ఒక్క దానిలో మాత్రమే వెన్న



ఉన్నట్టు తెలుసుకుని, నలుగురి మధ్యా చచ్చేసిగ్గుపడి పోయింది.

తన మొగుడు ఎంత యుక్తిగలవాడైనా తన మీదనే యుక్తులు ప్రయోగించటం నూకాలమ్మ సహించలేక పోయింది. ఆమె బస్తీ నుంచి తిరిగి వస్తూ, నల్లయ్య అనే గొర్రెలకాపరి మంద దగ్గిర ఆగి ఏవో కబుర్లు ప్రారంభించింది.

నల్లయ్య మందలో దాదాపు వంద గొర్రె లున్నాయి, కాని నల్లగొర్రె ఒకటే ఉంది. అదంటే నల్లయ్యకు ప్రాణం.

"నీ నల్లగొర్రెకు ఇవాల్టితో రుణం తీరిం దనుకో," అన్నది నూకాలమ్మ.

"అదేం?" అన్నాడు నల్లయ్య రోషంగా.

"ఇవాళ అర్ధరాత్రికి దాన్నెవరో ఎత్తుకు పోబోతున్నారు," అన్నది నూకాలమ్మ.

"నిజమా?" అన్నాడు నల్లయ్య.

"కనకనేగా ముందుగా హెచ్చరిస్తున్నానూ? దాన్ని ఎట్లా కాపాడుకుంటావో ఏమో!" అని నూకాలమ్మ బయలుదేరింది.

నూకాలమ్మ ఇల్లు చేరేసరికి పోతరాయుడు ఇంట్లోనే ఉన్నాడు. బయటి వాకిలి చప్పుడు వినిపించింది గాని, నూకాలమ్మ ఎంతసేపటికీ ఇంట్లోకి రాలేదు. ఆమె ఏం చేస్తున్నదో చూద్దామని పోతరాయుడు ఇంట్లో నుంచి బయటికి వచ్చేసరికి, నూకాలమ్మ ఇంటి ముందు అవరణలో చచ్చిపోయిన దానిలాగా పడి ఉన్నది.

ఆమెకేమయిందో నని పోతరాయుడు భయపడ్డాడు. దగ్గిరికి వెళ్ళి కదిలిస్తే శవంలాగా కదిలింది. ఊపిరి కూడా ఆడుతున్న లక్షణాలు లేవు. పోతరాయు డామెను మోసుకుని, ఇంట్లోకి తెచ్చి, మంచం మీద పడుకోబెట్టి, ముఖాన నీరుచల్లితే, నూకాలమ్మ ఊపిరి పీల్చసాగింది. కొంతసేపటికి ఆమె కళ్ళు తెరిచి, "ఎప్పుడో ఈ మూర్ఛతోనే నా ప్రాణం పోతుంది," అన్నది.

"మూర్ఛా? నా కెప్పుడూ చెప్పలేదే? దీనికి మందేమిటి?" అన్నాడు పోతరాయుడు.



"నల్లగొర్రె మాంసం తింటే కిందటిసారి నిమ్మళించింది," అన్నదామె.

"నల్లగొర్రె ఈ ప్రాంతాల ఎక్కడున్నది? నల్లయ్యగాడి దగ్గిర ఒకే ఒక గొర్రె ఉన్నది. వాడి ఎత్తు డబ్బు పోసినా వాడు దాన్ని ఇవ్వడు," అన్నాడు పోతరాయుడు.

"నా ప్రాణం ఇట్లా పోవాలిసిందేలే!" అంటూ నూకాలమ్మ మూలిగి మళ్ళీ కళ్ళు మూసింది.

ఆ రాత్రి నల్లగొర్రెను దొంగిలించాలని పోతరాయుడు నిశ్చయం చేసుకున్నాడు. నూకాలమ్మ చచ్చిపోతే వాడు మళ్ళీ కుక్క బతుకు బతకటం తప్ప మరో మార్గంలేదు.

నల్లయ్య దొంగ కోసం తన కుక్కతో సహా మంద సమీపంలో మాటువేసి ఉన్నాడు. పోతరాయుడు వచ్చి మందకు కాపలా లేరని భ్రమపడ్డాడు. మసక చీకట్లో వాడు నల్లగొర్రె కోసం పరకాయించి చూసి, చివరకు గుర్తుపట్టాడు. వాడు దాని కేసి గొర్రెలమధ్యగా పోతూండగా ఎక్కడినుంచో ఒక కుక్క వచ్చి వాడి మీద విరుచుకు పడింది. వాడు హడలిపోయి గొర్రెల మధ్య నుంచి బయటికి వస్తుండగా వీపు మీద ఠపీ మని కర్ర దెబ్బ పడింది.

చావు తప్పి కన్ను లొట్టపోయి పోతరాయుడు ఇల్లు చేరేసరికి నూకాలమ్మ అప్పుడే భోజనం చేసి, మంచం మీద కూర్చుని ఉన్నది. అతన్ని చూడగానే, "ఈ రాత్రివేళ ఎక్కడికి పోయావు? ఇంతకుముందే నాకు నిద్ర మెలకువొచ్చింది. ఇంత అన్నం తిన్నాను," అన్నదామె.

"నీ మూర్ఛ ఏమయింది?" అన్నాడు పోతరాయుడు.

"నాకు మూర్ఛేమిటి? కలగంటున్నావా ఏం?" అన్నది నూకాలమ్మ.

నూకాలమ్మ తనను శిక్షించటానికే ఇలా చేసిందని గ్రహించి పోతరాయుడు అది మొదలు బుద్ధిగా ఉన్నాడు.





# ధర్మసత్రం

ఒకసారి పాపన్న రాజధానికి పోవలసి వచ్చింది. అక్కడ పని చూసుకుని వచ్చేటప్పుడు దారిలో తన దగ్గిర ఉన్న డబ్బంతా కష్టాలలో ఉన్న వారికి ధర్మం చెయ్యటమే కాక, పాపన్న దారి తప్పి చిక్కులో పడ్డాడు. గాలివాన వచ్చింది. పాపన్న ఒక చోట జారి పడ్డాడు. బట్టలన్నీ బురద అయాయి. అతను ఆకలితో శోషపడుతూ ఒక అపరిచిత గ్రామం చేరి, అక్కడ కనిపించిన మనిషిని, "ఇక్కడ భోజనసత్రం ఏదైనా ఉన్నదా?" అని అడిగాడు.

"ఇప్పుడు లేదు గాని, త్వరలోనే ఇక్కడి ప్రభువుగారొక ధర్మసత్రం కట్టబోతున్నారు. భోజనం కావాలంటే ప్రభువువారి దేవిడీకి పోతే అక్కడ నిత్యమూ అన్నదానం జరుగుతూ ఉంటుంది," అన్నాడా మనిషి.

పాపన్న దేవిడీకి మార్గం తెలుసుకుని వెళ్ళి, చేతులూ, కాళ్ళూ కడుక్కుని పేదసాదలకు అన్నం పెట్టే చోట తాను కూడా వెళ్ళి కూర్చున్నాడు. అక్కడి వాళ్ళు చెప్పుకునే మాటల ద్వారా అతను కొన్ని విషయాలు తెలుసుకున్నాడు.

అక్కడి ప్రభువుకు చాలాకాలం పిల్లలు లేకపోతే, సత్రమూ, బావీ, చెరువూలాంటివి ఏర్పాటు చేయిస్తే పిల్లలు పుట్టుతారని ఎవరో చెప్పారు. అలాగే చేయిస్తానని ఆయన నిశ్చయించుకున్న కొద్ది కాలానికే ఆయనకు మగపిల్లవాడు కలిగాడట. సత్రమూ, బావీ, చెరువూ ఏర్పాటు చెయ్యటానికి పదివేలు ఖర్చవుతుందని అంచనా వేశారు. అందులో మూడువంతులు ప్రభువు వేసుకునేటట్టూ, ఒక వంతు రైతుల నుంచి వసూలు చేసేటట్టూ ఏర్పాటయింది. చెరువు ఏర్పడితే రైతుల పొలాలకు నీరందుతుంది, వాళ్ళూ లాభం పొందుతారు గనక, వాళ్ళు చందాలు వేసుకోవటం భావ్యమే. ప్రభువుగారు ఖర్చు

చేయదలిచిన ధనాన్ని నేడో రేపో శివాలయా నికి తీసుకుపోయి, దేవుడికి నివేదన చేసి, ఆ తరవాత దానితో పని ప్రారంభించ బోతున్నారు కూడా. ఈ సంగతులన్నీ వింటూ పాపన్న భోజనం ముగించాడు.

భోజనాలు చేసిన వాళ్ళు బయటికి వెళ్ళి పోవటానికి ఒక దారి ఏర్పాటు చేశారు. అది హజారానికి పోతుంది. అక్కడ ప్రభువు గారు ఒక ఆసనం మీద కూర్చుని ఉంటాడు. అన్నదానం పొందిన వాళ్ళందరూ ఆయన దగ్గిర ఆగి, "అన్నదాతా, సుఖీభవ! తమ ఉపకారం మరవలేను. దేవుడు మీకు మేలు చేయాలి," అని, ఒక నౌకరిచ్చే పావలా దక్షిణతోబాటు తాంబూలం పుచ్చుకుని, తన పేరు చెప్పి వెళ్ళిపోవాలి. పాపన్న కూడా అలాగే చేశాడు.

పాపన్న తన పేరు చెప్పుకుని పావలా దక్షిణ తాంబూలం పుచ్చుకుంటూండగా విని, ప్రభువు ఉలిక్కిపడ్డట్టయి, అతన్ని వెనక్కు పిలిచి, వివరాలు అడిగి, అతనే పరోపకారిగా ప్రసిద్ధికెక్కిన పాపన్న అని తెలుసుకున్నాడు. ఆయన పాపన్న పేరు విని ఉండటమే కాదు, అతనంటే చాలా అసూయగా కూడా ఉన్నాడు. ఆ పాపన్న చాలా సామాన్యుడు. దానధర్మాలలో



అయినా తన వంటి వాడితో ఏ మాత్రమూ పోటీ చెయ్యలేడు. కాని అతనికున్న ఖ్యాతిలో తనకు పదో వంతు లేదు. అంత పేరు ప్రఖ్యాతులు గల పాపన్నను హీనంగా చూడటానికీ, హీనుడని నలుగురికీ చూపటానికీ ప్రభువు మంచి ఆలోచన చేశాడు.

పాపన్న తాను తిండికి మాడేస్థితి ఎలా సంభవించినదీ చెప్పాక ప్రభువు, "చూడు, పాపన్నా! నువు ఇతరులకు సహాయం చేసే వాడివి. అలాటి వాడికి నే నివాళ ప్రాణం నిలబెట్టాను. నీ వంటి వాడు మాటలతో కృతజ్ఞత చెప్పటం నీకూ తృప్తిగా ఉండదు, నాకూ ఉండదు. అందుచేత నాకు ఏదో



విధంగా ప్రత్యుపకారం చెయ్యటం ఉచితం," అన్నాడు.

"నా నుంచి ఎలాటి ప్రత్యుపకారం కోరుతారో సెలవివ్వండి," అన్నాడు పాపన్న.

"ప్రస్తుతం ధర్మసత్రం పని ఒత్తిడి చాలా హెచ్చుగా ఉన్నది. నాలుగు రోజుల పాటు నాకు అదనపు నౌకర్లు కావాలి. నాకు నౌకరుగా ఉండమని నేను నిన్నడగను. అది భావ్యం కాదు. కాని నీ అంతట నువే నా దగ్గిర నాలుగు రోజులపాటు నౌకరుగా ఉండి ఋణం తీర్చుకుంటానన్న పక్షాన నాకు అది తగిన ప్రత్యుపకారం అవుతుంది," అన్నాడు ప్రభువు.



"అయ్యా, నా కీ పూట అన్నం పెట్టి నా ప్రాణం కాపాడారు గనక దానికి ప్రత్యుపకారంగా నన్ను మీ సేవకుడుగా ఉపయోగించుకోండి," అన్నాడు పాపన్న.

ప్రభువు గొప్ప విజయం సాధించిన వాడిలాగా అందరి కేసీ చూశాడు. పాపన్న అన్న మాటలు అక్కడున్న వారందరూ విన్నారు. ప్రభువుకు తృప్తి అయింది, "సరే, పాపన్నా, నీ యిష్టప్రకారమే కానీ, నువు నాలుగు రోజులపాటు నాకు సేవకుడుగా పని చెయ్యి," అన్నాడు.

నిజానికి పాపన్న చేత చేయించుకోదగిన సేవ ఏదీ లేదు. కాని పదిమంది ఉన్నప్పుడు ప్రభువు వాళ్ళకు పాపన్నను పరిచయం చేసి, అతని కేదో పని చెప్పి పంపేవాడు. ఇందువల్ల తన కీర్తి పెరుగుతున్నదని ఆయన నమ్మకం.

ప్రభువుగారి ధనాన్ని దేవుడికి సమర్పించి, సత్రానికి శంకుస్థాపన చేసే ముహూర్తం రోజు వచ్చింది. నూరేసి రూపాయలను ఒక్కొక్క పసుపుగుడ్డలో కట్టి, అలాటి చిన్న మూటలు అయిదేసి కలిపి ఒక్కొక్క పెద్ద మూటగా కట్టి మొత్తం పదిహేను పెద్ద మూటలు చేసి, పదిహేనుమంది పట్టుకుని, మిగిలిన పరివారాన్ని వెంట బెట్టుకుని



ఆలయానికి బయలుదేరారు. ధనంమూట ఒకటి ప్రభువుగారే స్వయంగా పట్టుకున్నాడు. మిగిలిన పధ్నాలుగు మందిలో పాపన్న కూడా ఉన్నాడు.

అందరూ కలిసి సన్నని దారి వెంట నడుస్తూండగా ప్రభువుగారు తూలాడు. ఆయన చేతిలో ఉన్న డబ్బుమూట కిందపడి దొర్లి, దారి పక్కన ఉన్న బురదగుంటలో పడి పోయింది. వెంటనే కొందరు బురదలో దిగి వెతికారు. పెద్దమూట కింద పడినప్పుడు ఊడి పోయినట్టున్నది. అందులో ఉన్న చిన్న మూటలు, వెతికే వాళ్ళకు విడివిడిగా దొరికాయి. అ దొరకటం కూడా నాలుగే దొరికాయి. అయిదోది ఒకంతట దొరకలేదు.

"నూరురూపాయలే కద? ఇంటి నుంచి తెప్పిస్తాం. ఒక నూరు భూదేవికి అర్పించామనుకుంటాం," అంటూ ప్రభువు తన ఇంటి కొక నౌకరును డబ్బు తెచ్చేందుకు పంపి, తాను మిగిలిన వాళ్ళతో సహా ఆలయానికి సాగిపోయాడు.

పాపన్న మటుకు ఆ బురదగుంటను మరింత లోతుగా కుళ్ళగించి, చాలాసేపు ప్రయాస పడ్డ మీదట అయిదో నూరు రూపాయల మూటను సంపాదించాడు. అప్పటికి రాత్రి ఝాము పొద్దు పోయింది.




ఈ లోపల ధనాన్ని దేవుడికి నివేదన చెయ్యటమూ, ధర్మ సత్రానికి శంకుస్థాపనా అయిపోయింది.

పాపన్న ప్రభువుగారింటికి వెళ్ళి స్నానం చేసి, రూపాయల మూటకు పట్టిన మురికి పోయినంత వరకు కడిగి, దాన్ని తీసుకు పోయి ప్రభువు ఎదట పెట్టి, "ఇదుగోనండీ, బురదలో పడిపోయిన నూరురూపాయల మూట," అన్నాడు.

ప్రభువు సందిగ్ధంలో పడ్డాడు. సత్రానికి కేటాయించిన డబ్బు ఈశ్వరార్పితం అయింది. ఇప్పుడీ నూరూ అందులోది కాదు. దాన్ని పాపన్న దగ్గిర తీసుకుంటే

అది తన సొంతానికి తీసుకోవటమే అవుతుంది. అందుచేత ప్రభువు, "దాన్ని నేను అప్పుడే వదిలేశాను. అందుచేత నువే ఉంచుకో. నాలుగు రోజులుగా సేవ చేశావు కద. అన్నట్టు నీ గడువు పూర్తి అయింది. రేపు నువు వెళ్ళిపోవచ్చు," అన్నాడు.

పాపన్న మర్నాడు ఆ నూరురూపాయల మూటతో తన ఊరికి బయలుదేరాడు. అతను ఆ జమీందారీ శివార్లు చేరే సరికి అమితంగా దాహం వేసింది. అతను ఒక రైతు ఇంటి దగ్గిర ఆగి మంచినీరడిగాడు.

"తాగు, నాయనా. ఈ నీళ్ళతో రేపు మాకూ రుణం తీరుతున్నదిలే," అన్నాడు రైతు నిస్పృహగా.

సంగతేమిటని రైతు నడిగాడు పాపన్న. ప్రభువుగారు కట్టించే ధర్మసత్రం వగైరాల కింద ఆ రైతు వంతు నూరు రూపాయలిచ్చుకోవలిసి వచ్చిందట. ఎంత ప్రయత్నించినా రైతు ఒక్క దమ్మిడీ పోగు చెయ్యలేక పోయాడు. రెండునెలలు గడువియ్యమని కోరితే ప్రభువుగారి ఉద్యోగులు, గడువులోపల కట్టకపోతే జమీందారీ నుంచి గెంటేస్తామన్నారుట.

పాపన్న రైతుకు తన వద్ద ఉన్న నూరు రూపాయల పసుపుగుడ్డ మూట ఇచ్చి, "దీన్ని తీసుకుపోయి కట్టు. నిజానికిది వారి డబ్బే. ప్రస్తుతం నా డబ్బు. నేను దీన్ని నీ కిస్తున్నాను," అన్నాడు.

రైతు దాన్ని మర్నాడే తీసుకుపోయి దివాణంలో కట్టాడు. మట్టి మరకలుగల పసుపు గుడ్డలో నూరురూపాయలు చూసి, "ఇది మన డబ్బులాగే ఉందే?" అన్నారు ఉద్యోగులు ప్రభువుతో. ప్రభువు రైతును, "ఇది నీ కెలా వచ్చింది?" అని అడిగితే పాపన్నే ఇచ్చినట్టు తెలిసింది.

పాపన్న తన డబ్బును తనకే చేర్చినందుకు ప్రభువు ఆశ్చర్యపోవటమే గాక, సిగ్గుపడిపోయాడు కూడా.





# కపట వైద్యుడు

కుంభీనస నగరంలో ఒక కపటవైద్యుడుండేవాడు. అతని పేరు శివబైరాగి. ఈ వైద్యుడు తాను సమస్త వ్యాధులూ నయం చెయ్యగలనని చెప్పుకుంటూ, గొప్ప వైద్యుడని కొందరిని నమ్మిస్తూ పొట్టపోసుకునేవాడు. అతని వద్ద ఏవేవో భస్మాలూ, అంజనాలూ, మాత్రలూ, కుప్పెలూ, రసాయనాలూ ఉండేవి.

ఒకసారి ఆ దేశపు యువరాజుకు ఒక వింత జాడ్యం సంప్రాప్తమయింది. అతనికి ఆకలిదప్పులు పోయాయి. నీరసంగా మంచాన పడి ఉంటాడు. తానై ఎవరితోనూ మాట్లాడడు. ఎవరైనా పలకరిస్తే చిరాకుగా సమాధానమిస్తాడు. ఎప్పుడూ దిగులుగా ఉంటాడు.

రాజవైద్యులకు యువరాజు రుగ్మత ఏమిటో, అది ఎలా సంప్రాప్తమయిందో అంతు చిక్కలేదు. వాళ్ళు అనేక ఔషధాలు వాడి చూశారు గాని, వాటివల్ల ఏ ప్రయోజనమూ లేకపోయింది.

యువరాజు అనారోగ్యం గురించి రాజు గారికి బెంగ పట్టుకున్నది. మంత్రులూ, ఇతర రాజోద్యోగులూ శివబైరాగిని పిలిపించమని సలహా ఇచ్చారు.

"ఛీ, ఛీ! వాడేం వైద్యుడు? అపర ధన్వంతరులలాటి ఆస్థానవైద్యులకు అంతు బట్టని వ్యాధి ఆ మందులమ్ముకునే వాడికి అంతు పడుతుందా?" అన్నాడు రాజు.

"అలా అనటానికి లేదు, మహారాజా. ఘన వైద్యులకు తెలియని చిట్కాలు అడవుల్లో ఉండే కోయవాళ్ళకు తెలుస్తాయి. శివ బైరాగి ఎందరినో చచ్చేవాళ్ళను బతికించాడని చెప్పుకుంటారు. ఆస్థాన వైద్యులకు అంతు చిక్కని జబ్బును అలాటి చిట్కా వైద్యులే నయం చెయ్యాలి," అన్నారు రాజుగారి వద్ద కొలువు చేసేవాళ్ళు.

ఆర్. సంపత్‌కుమార్



రాజు కొంచెం ఆలోచించి, "అయితే ఒక పని చేద్దాం. మామూలు వైద్యంతో నయంగాని తీవ్రవ్యాధులు గలవారిని కొంద రిని తెప్పించి, ఈ బైరాగి వైద్యుడి చేత చికిత్స చేయింతాం. వాళ్ళ వ్యాధులు నయం చేసినట్టయితే, ఈ బైరాగి చేత అబ్బా యికి చికిత్స చేయిస్తాను. లేదూ, ఆ కపట వైద్యుడి తల నరికించి, కోట గుమ్మానికి వేళ్ళాడగట్టిస్తాను!" అన్నాడు.

రాజుగారు చేసిన ఈ ఆలోచన మంత్రులు మొదలైన వాళ్ళకు యుక్తి యుక్తంగా కన బడింది. వాళ్ళు ఊరంతా తిరిగి అయిదారు గురు దీర్ఘరోగులను, ఏ చికిత్సకూ లొంగని వాళ్ళను, పట్టుకొచ్చి యువరాజు పడుకుని ఉన్న గదికి పక్కగా ఉన్న గదిలో పడుకో బెట్టారు. తరవాత శివబైరాగిని పిలిపించి రాజుగారు, "నువు కపటవైద్యుడి వని విన్నాను. నీకు వైద్యం నిజంగా చేతగాని పక్షంలో నిన్ను తీవ్రంగా శిక్షించవలసి ఉంటుంది. ఏమంటావు?" అని అడిగాడు.

"మహారాజా, నేను అనేకవేల మందికి చికిత్స చేసి ఉన్నాను. నా వైద్యవిధానం వేరు, నేను వాడే ఔషధాలు వేరు. కిట్టని వాళ్ళు నాకు వైద్యం రాదని పుకార్లు వేస్తారు. వాటిని నమ్మి తమరు నన్ను శిక్షించటం భావ్యం కాదు," అన్నాడు శివబైరాగి.

"అయితే నీకు వైద్యం వచ్చునని రుజువు చేసుకో. లోపల తీవ్రమైన వ్యాధు లతో చాలాకాలంగా తీసుకుంటున్న రోగు లున్నారు. వారందరికీ రోగాలు నయం చెయ్యి. నిన్ను రాజవైద్యుణ్ణి చేసి సన్మా నిస్తాను. రోగాలు నయం చెయ్యకపోయావో నీ తల తీయించి, కోట గుమ్మానికి వేళ్ళాడ గట్టిస్తాను," అన్నాడు రాజు.

శివబైరాగికి నోటమాట రాలేదు. రాజ భటులు అతన్ని రోగులున్న గదికి తీసుకు పోయారు. కొందరు రాజోద్యోగులు కూడా వెంట వెళ్ళారు.

"నేను రోగులను రహస్యంగా ప్రశ్నించాలి. మీరంతా అవతలికి వెళ్ళండి," అని శివబైరాగి రాజోద్యోగు లందరినీ బయటికి పంపేసి తలుపులు మూశాడు. అవతలి గదిలో రాజకుమారుడున్న సంగతి అతనికి తెలియదు.

తరవాత ఆ కపటవైద్యుడు రోగులందరి నాడీ పరీక్షించినట్టు నటించి, "మీ అందరి రోగాలూ నయంచేయగల బ్రహ్మాస్త్రంలాటి లేపనం ఒకటి ఉన్నది. మనిషి గుండెకాయ తీసి, కాల్చి, నూరి, కొన్ని ఓషధులతో చేర్చి దాన్ని మీకు పూతపూయాలి. మూడు పూతలు పూసేసరికల్లా అందరూ పిడిరాళ్ళలాగా తయారవుతారు. ఈ ఔషధం తయారు చెయ్యాలంటే మీలో మరీ తీవ్రస్థితిలో ఉన్న వాడు చావటానికి ఒప్పుకోవాలి," అంటూ ఒక క్షయవ్యాధి వాడి కేసి చూశాడు.

క్షయవాడికి కంపరమెత్తింది. "నాకసలు రోగమేముంది? నేను పిడిరాయిలాగున్నాను. వొద్దు మొర్రో అంటుంటే వినకుండా మావాళ్ళు నాకు మందు లిప్పించారు. నాకే రోగమూ లేదు! ఏ రోగమూ లేదు!" అంటూ వాడు లేచి, తలుపు తెరుచుకుని శరవేగంతో బయకి పరిగెత్తివెళ్ళాడు.

వాడు వెళ్ళిన మరుక్షణమే మరొకడూ, వాడి వెనకగా ఇంకొకడూ విల్లు నుంచి వది



లిన బాణాల్లాగా, "నా కే రోగమూ లేదు! నేను పిడిరాయిలాగున్నాను!" అంటూ బయటికి దూసుకుపోయారు.

రోగులందరూ తమ కే రోగమూ లేదంటూ వెళ్ళిపోవటం చూసి రాజుకు చాలా ఆశ్చర్యం కలిగింది. అశ్వినీదేవతలే వచ్చి చికిత్స చేసినా అయిదారుగురి దీర్ఘ వ్యాధులు అరనిమిషంలో నయం కావటం సాధ్యంకాదు. ఏం జరిగిందో చూద్దామని రాజు సపరివారంగా లోపలికి వెళ్ళాడు. ఖాళీ గదిలో శివబైరాగి కనిపించాడు. అవతలి గదిలో నుంచి రాజకుమారుడు పొట్ట చెక్కలయేటట్టు నవ్వటం రాజుకు వినిపించింది.

రాజు తన కొడుకును సమీపించి, ఇంత కాలానికి వాడిలో సంతోష చిహ్నాలు చూసి పరమానందం చెందుతూ, "నీ జబ్బు నయమయిందా, నాయనా? ఎందుకలా నవ్వుతున్నావు?" అని అడిగాడు.

"నా కేం జబ్బు? నేను పిడిరాయిలాగున్నాను?" అంటూ రాజకుమారుడు మళ్ళీ విరగబడి నవ్వాడు.

అతని ద్వారా రాజు జరిగిన సంగతంతా తెలుసుకున్నాడు. కపటవైద్యుడు ప్రాణాలరచేత బట్టుకుని శిరశ్ఛేదానికి ఎదురు చూస్తున్నాడు.

రాజు అతని కేసి తిరిగి, "నీకు వైద్యం ఏమీ రాదు. అయినా నిన్ను క్షమిస్తాను. నువు ఇక ముందు వైద్యం చెయ్యటం మానేసి, మా ఆస్థానంలో విదూషకుడివిగా ఉండు! యువరాజు వెంట వుంటూ అతడికి దిగులు అన్నది కలగకుండా చూడటం నీ పని!" అన్నాడు.

శివబైరాగి ఆస్థాన విదూషకుడుగా ఉంటూ రాజకుమారుడికి ఎలాటి విచారమూ కలగకుండా చూశాడు.

అందుకే హాస్యాన్ని మించిన ఔషధం లేదంటారు.





# కృష్ణావతారం

ఆ యేడు చక్కని వర్షాలు కురిశాయి. పశువులూ, వాటి దూడలూ చక్కగా నవనవలాడుతూ తయారయాయి. పంటలు బాగా పండాయి. గడ్డీ, లతలూ, చెట్లూ సమృద్ధిగా పెరిగాయి. పాడీ, పంటా ఎన్నడూ లేనంత బాగా గోకులానికి లభించాయి.

వానలు వెనకపట్టి శరత్కాలం వచ్చింది. నందగోపుడు మొదలుగా గల పెద్దలు తమలోతాము మాట్లాడుకుని ఇంద్రోత్సవం చేద్దామని నిశ్చయించుకున్నారు. అనుకోవటమేమిటి, మరుక్షణమే అందుకు ప్రయత్నాలు కూడా ప్రారంభమయాయి. అందరూ హడావుడిగా తిరగసాగారు.

కృష్ణుడీ హడావుడి చూసి నవ్వుతూ గోపకులతో, "మీరంతా ఎందుకింత సంభ్రమంలో ఉన్నారు? ఏం పండగ ఇది? ఏ దేవుణ్ణి కొలవబోతున్నారు? ఆ దేవుడివల్ల కలిగే లాభా లేవి?" అన్నాడు.

గోపకులలో అతి వృద్ధుడైనవాడు కృష్ణుడితో, "బాబూ, లోకపాలకు లందరికీ ఇంద్రుడు రాజు గదా. వర్షర్తువు అతనిదే నాయె. గోగణాలకు మేలు చేసే ఆ దేవుడు గోపకులకు ఎంతైనా కొలవదగిన దేవుడు. అందుచేత ఇంద్రోత్సవం తలపెట్టాం," అని చెప్పాడు.

అది విని కృష్ణుడిలా అన్నాడు: "మనుష్యుల కుండే వృత్తులు మూడు. అవేవంటే వ్యవసాయమూ, వర్తకమూ, పశుపోషణా. ఎవరే వృత్తి చేస్తే వారి కదే దేవుడు. మనం గోపాలకులం; అడవులలో ఉంటాం,

8. గోవర్ధనోద్ధరణ





ఈ విధంగా కృష్ణుడు చాలా సేపు బోధించిన మీదట అతను చెప్పినది మిగిలిన వాళ్ళకు నచ్చింది. అదీ గాక వాళ్ళు పూర్తిగా కృష్ణుడి పైన ఆధారపడి, అతనే తమకు అన్నింటికీ దిక్కన్న ధోరణిలో ఉన్నారు. ఎందుకంటే, అతను చేసిన అద్భుతాలు అన్నీ ఇన్నీ కావు. వాటికి తోడు అతను వాళ్ళను ఎన్నోసార్లు ఆపదల నుంచి కాపాడాడు. వాళ్ళ పాలిటికి అతను మనిషి కాదు, దేవుడు.

గోపాలకులు ఇంద్రోత్సవం మానేసి, బ్రాహ్మణులను పిలిపించి గిరియజ్ఞోత్సవానికి తగిన ఏర్పాట్లు చేశారు. పాయసాలూ, అపూపాలూ, ఉండ్రాళ్ళూ మొదలైనవి తయారయాయి. రకరకాల అన్నాలూ, మాంసాలూ, మధువులూ, పచ్చళ్ళూ, పెరుగూ, నెయ్యీ, పాలూ మొదలైనవి వీలునుబట్టి కావళ్ళలోనూ, బళ్ళ మీదా ఎక్కించారు. ఆబాలగోపాలంగా గోపికలూ, గోపకులూ వాద్యాలతో సహా వృద్ధగోపకుల వెంబడి, గోవర్ధనపర్వతానికి జాతర చేస్తూ బయలుదేరారు.

గోవర్ధనగిరి సమీపంలో ఒక మంచి స్థలంలో పేడతో అలికి, అందంగా ముగ్గులు పెట్టి ఉన్న స్థలాన, కృష్ణుడి అధ్వర్యాన

కొండల్లో తిరుగుతాం, పశువులను పెంచుతూ జీవిస్తాం. అందుచేత మనకు అడవులూ, కొండలూ, పశువులూ దేవతలు. ఎవరి కుల దేవతలను వాళ్ళు పూజించాలి. కర్షకులు గ్రామాలలో నివసిస్తారు, ఆటవికులు అరణ్యంలో నివసిస్తారు, మనం కొండలలో నివసిస్తాం. బ్రాహ్మణులు మంత్రయజ్ఞం చేస్తారు; కర్షకులు నాగలియజ్ఞం చేస్తారు; గోపాలకులు కొండయజ్ఞం చేస్తారు. అందుచేత మనం పర్వతోత్సవం జరపటం యుక్తంగా ఉంటుంది. నేను చెప్పినట్టు చెయ్యక పోయారో బలాత్కారంగానైనా మీ చేత చేయిస్తాను."





గిరిపూజ జరిగింది. కొండకు తాము తెచ్చిన ఆహారపదార్థాలు నైవేద్యం పెట్టారు, గోపాలకు లందరూ కొండకు పుష్పాంజలు లిచ్చి నమస్కారాలు చేశారు. అందరూ ఈ పనులలో నిమగ్నులై ఉన్న సమయంలో కృష్ణుడే పర్వతాధి దేవత లాగా కొండశిఖరాన ప్రత్యక్షమై, అందరూ ఆశ్చర్యంతో చూస్తూండగా, చెయ్యి చాచి నైవేద్య మంతా ఆరగించేశాడు. తరవాత అతను, "మీ భక్తికి మెచ్చాను. నాకు తృప్తి అయింది," అన్నాడు.

గోపకు లంతా చేతులు మోడ్చి, "దేవా, మే మంతా నీ దాసులం. నీ ఆజ్ఞకు లోబడి ఉన్నాం. మాకు ఏమి ఆనతిస్తావో అయ్యా. ఆ ప్రకారం నడుచుకుంటాం," అని పర్వత దేవుడితో అన్నారు.

"కొండరూపంలో ఉన్న నన్నే ఇక నుంచీ మీరు దేవతగా ఆరాధించండి. అలా చేస్తే మీ కోరిక లన్నీ తీరుతాయి, మీ గోవులు వృద్ధి పొంది అమృతధారలు పితుకుతాయి. నేను కామరూపంతో మీలో ఒకడుగా ఉంటూ ఉంటాను," అని చెప్పి కొండ మీది దేవుడు అదృశ్యమయాడు.

గోపాలకులు కొండ మీది కృష్ణుణ్ణీ, కొండ కింది కృష్ణుణ్ణీ ఒకే సమయంలో చూసి దణ్ణాలు పెట్టుకున్నారు. తరవాత వాళ్ళు తమ పశువుల కొమ్ములకు పూజ చేశారు, వాటి మెడలకు చిరుగజ్జెలు కట్టారు, లతలు తెచ్చి వాటి తలలకు చుట్టారు, ఇంకా అనేక అలంకరణాలు చేశారు. పెద్దపెట్టున కేకలు పెడుతూ కొండ చుట్టూ ప్రదక్షిణం చేసి, అక్కడక్కడా దిగదుడుపులు తీశారు. తరవాత బ్రాహ్మణసంతర్పణలు చేసి, యజ్ఞశేషాన్ని తాము తమవారితో కలిసి సంతోషంగా తిన్నారు. ఉత్సవం పూర్తి అయింది. కృష్ణుడితో సహా అందరూ వ్రేపల్లెకు తిరిగి వెళ్ళిపోయారు.

అక్కడ స్వర్గంలో ఇంద్రుడికి తీరని అవమానమై, పట్టరాని కోపం వచ్చింది.





వచ్చి మీ ప్రతాపం ఏపాటిదో ఆకాశం నుంచి చూస్తాను," అన్నాడు.

గోకులంలో వాళ్ళకు ఈశాన్యదిక్కున మెరుపులు కనిపించాయి. గాలి తీవ్రంగా వీచింది. ఎండ దుస్సహమై, దుర్భరమైన ఉక్క పుట్టుకొచ్చింది. చంటిపిల్లలు అలమటించారు. పెద్దవాళ్ళకు కాళ్ళు బొబ్బలెక్కాయి. చెట్టుచేమలకు చీడ పట్టుకొచ్చింది. వాన వచ్చే లక్షణాలు బాగా కనిపించాయి.

తూర్పున మేఘం పట్టి ఉరుముతున్నది. "ఈ అకాలవర్ష మేమిటబ్బా?" అనుకున్నారు గోపపెద్దలు.

చూస్తూండగానే కాలమేఘాలు ఆకాశమంతటా సంచారం సాగించి, సూర్యుణ్ణి చాటు చేశాయి. ఆకాశం సాంతం మూసుకుపోయింది. పెళపెళార్భాటాలతో, కళ్ళు చెదిరే మెరుపులతో పిడుగులు పడనారంభించాయి. తరవాత వడగళ్ళు పడ్డాయి. ఆ వెంటనే, భూమ్యాకాశాల మధ్య ఎడం లేకుండా కుంభవర్షం ప్రారంభమయింది.

ఆ వర్షం చూసి గోపకులు బెదిరిపోయారు. ప్రళయం ప్రారంభమైనట్టు వారికి తోచింది. ఆ వర్షం నుంచి ప్రాణాలెలా కాపాడుకోవాలో, ఎక్కడకి పారి

అతను సంవర్తం మొదలుగా గల మహా మేఘాలను పిలిచి, "చూశారా, బృందావనంలో ఉండే నందగోపకుడు మొదలైన ముసలి గొల్లలు మదమెక్కి, ఏటా నాకు చేసే పూజలు మాని, కపటి అయిన కృష్ణుడి మాటలు విని, ఒక చచ్చుకొండకు చేశారు. అంతటితో అయిందనుకున్నారు కాబోలు. మీరు ఏడురోజుల పాటు ఎడాతెరిపీ లేకుండా బ్రహ్మాండమైన వాన కురిసి, వాళ్ళకు బతుకుతెరువుగా ఉండే గోవులకు హాని కలిగించండి. ఆ విధంగా ఆ గోపకులకు హాని కలిగించి వచ్చారంటే నేను చాలా సంతోషిస్తాను. నేను కూడా మీ వెనకే





పోవాలో వారికి తోచలేదు. పశువుల పాట్లు వర్ణనాతీతం. చెట్లు కూడా తీవ్రంగా దెబ్బ తిన్నాయి, కొన్ని పిడుగులు పడి మాడి పోయాయి, కొన్నిటిని గాలి పడగొట్టింది, మరి కొన్ని వరదలలో కొట్టుకుపోయాయి. గాలివాన అక్కడి అరణ్యా లన్నిటినీ భీభత్సం చేసేసింది. పక్షులు అసంఖ్యా కంగా చచ్చాయి.

ఇక మనుషుల దుస్థితి వర్ణనాతీతం. గుడిసెలు కూలిపోయాయి. బళ్ళు తిరగ బడ్డాయి. పశువులు చాలా నశించాయి. వంటలూ, వార్పులూ లేవు. పాలుపితకటం నిలిచిపోయింది. ఆ దుస్థితిలో గోపకులు కృష్ణుడి వద్దకు వెళ్ళి, "నువే మాకు దిక్కు! కాపాడు! కాపాడు!" అని మొర పెట్టుకున్నారు.

కృష్ణుడికి ఇంద్రుడి దుర్బుద్ధి అర్థ మయింది. తనకు జరగవలసిన ఉత్సవాన్ని కృష్ణుడు మాన్పించా డన్న రోషంతో, గోకులం మీద ఇంద్రుడిలా పగ దీర్చు కుంటున్నాడు. ఇలా చెయ్యటంతో కృష్ణుడు అసహాయుడై పోతాడని ఇంద్రుడి నమ్మకం. గోవర్ధనపర్వతాన్ని ఆకాశాని కెత్తి దాని కింద గోపకులకూ, గోవులకూ రక్షణ కలి గించటానికి కృష్ణుడు నిశ్చయించాడు.



అతను వెంటనే గోవర్ధనపర్వతాన్ని అవలీలగా భూమి నుంచి పెరికి, తన చేత్తో గొడుగు లాగా ఎత్తి పట్టుకున్నాడు. అతను దాన్ని పెకలించేటప్పుడు గండరాళ్ళు పెద్ద చప్పుడుతో కిందికి దొర్లి వచ్చాయి. చెట్లు కూలి పడ్డాయి. గుహలలో ఉండే సింహాలూ, బిలాలలో ఉండే పాములూ బయటికి వచ్చాయి. దాని మీద ఉండే విద్యాధరులు పారిపోయారు; తపస్సు చేసుకునే మును లకు తపోభంగ మయింది.

కృష్ణుడు గోవర్ధనగిరి ఎత్తి, "మీరూ మీ పశువులూ దీని కిందికి వచ్చెయ్యండి. వాన మిమ్మల్ని బాధించదు," అని గోపకు





లను పిలిచాడు. వాళ్ళు బిలబిలా పరిగెత్తుకుంటూ, తమ సామానులనూ, బళ్ళనూ, స్త్రీలనూ, పిల్లలనూ, గోవులనూ వెంటబెట్టుకుని కొండ కిందికి వచ్చేశారు.

ఏడురోజులూ కుంభవర్షం కురిసిన తరవాత ఇంద్రుడు మేఘాలను ఉపసంహరించి వెళ్ళిపోయాడు. ఆకాశం నిర్మలమయింది. గోపకుల మంతా కొండ కింది నుంచి ఇవతలికి వచ్చేసింది. కృష్ణు డా పర్వతాన్ని యథాస్థానంలో ఉంచేశాడు. తరవాత అతను కొండ మీద ఎక్కి కూర్చుని, చుట్టూ మేతలు మేస్తూ సంచరించే గోవులను చూడసాగాడు.



కృష్ణుడు చేసిన అద్భుతం చూశాక ఇంద్రుడు నిర్వికారంగా ఇంట్లో కూర్చోలేక పోయాడు. అతని కేదో బెదురు పుట్టింది; అందుచేత కొద్దిమంది దేవతలను వెంట తీసుకుని, ఐరావత మెక్కి, వజ్రాయుధం చేత బట్టి, భూలోకానికి దిగి, గోవర్ధనగిరి మీద కృష్ణుడు కూర్చుని ఉన్న చోటికి వచ్చి, కృష్ణుణ్ణి చూసి అతను దేవదేవుడని తెలుసుకుని, ఐరావతాన్ని దిగి, తల వంచి నమస్కరించాడు.

కృష్ణుడు ఇంద్రుణ్ణి చూడనట్టు నటిస్తూ నిశ్చలంగా కూర్చుని ఉండిపోయాడు. అతనికి తన మీద ఆగ్రహంగా ఉందని ఇంద్రుడు గ్రహించి, స్తోత్రపాఠాలు చదివాడు; గోపాలుడుగా ఉన్న కారణం చేత సర్వేశ్వరుడని గుర్తించలేక, తాను మదాంధత్వంతో అపచారం చేశానని ఒప్పుకున్నాడు; క్షమించ వలసిందని వేడుకున్నాడు. తరవాత అతను కృష్ణుణ్ణి గోపతిగా అభిషేకించి, అతడికి దివ్యాంబరాభరణాలు కట్ట బెట్టాడు.

చివరకు ఇంద్రుడు ఇలా అన్నాడు:

"కంసుడి కింద ఇంకా అనేకమంది రాక్షసులు నీకు హాని చేయాలని ఉన్నారు. వారందరూ నీ చేత చస్తారు. కంసుణ్ణి కూడా





చంపి నువు రాజువవుతావు. మీ మేనత్త అయిన కుంతికి ధర్మరాజూ, భీముడూ పుట్టాక నా వల్ల అర్జునుడు కలిగాడు. అతను నీకు భక్తుడై నిన్నాశ్రయిస్తాడు. నువ్వతన్ని ఆదరించి, కనిపెట్టి ఉండాలి, అతనికి కీర్తి తేవాలి; ముందుముందు కౌరవ పాండవ యుద్ధం జరుగుతుంది, ఆ యుద్ధంలో అసంఖ్యాకులైన రాజులు పాల్గొంటారు. అందులో అతనికి విజయం చేకూర్చిపెట్టాలి. ఇదే నా కోరిక."

దానికి కృష్ణుడు జవాబిస్తూ, "మా మేనత్త కొడుకులు అయిదుగురూ మహాపరాక్రమ సంపన్నులు. దేవతాంశలతో జన్మించినవారు. ఒకనాడు భూమి కంతకూ ఏలికలు కాబోతారు. అందరిలోకీ మధ్య వాడైన అర్జునుడు అసాధారణ శౌర్యవంతుడు. ఈ విషయా లన్నీ నాకు ముందే తెలుసు. నువ్వెంత చెప్పావో అంతా చేస్తాను. నువు రావటం నాకు చాలా సంతోష కారణ మయింది. ఇక నువు నిశ్చింతగా వెళ్ళవచ్చు," అని చెప్పాడు.

ఇంద్రుడు కృష్ణుడి కాళ్ళ మీద సాష్టాంగ పడి, అతని చుట్టూ ప్రదక్షిణంచేసి, ఐరావత మెక్కి, దేవతలతో సహా తన లోకానికి వెళ్ళిపోయాడు. తరవాత కృష్ణుడు కొండ దిగి వ్రేపల్లెకు వచ్చేశాడు.

అతను రాగానే గోపప్రముఖు లందరూ అతని చుట్టూ మూగారు. అతను మామూలు మనిషి కాదని వారి కీ సారి పూర్తిగా తెలిసిపోయింది. వాళ్ళు అతనితో, "బాబూ, మా మధ్య ప్రచ్ఛన్నంగా ఉంటున్న నువు నిజంగా ఎవరు ? మూడులోకాలనూ రక్షించ గలిగినట్టున్నావు, ఇక్కడ గోవులను కాస్తున్నావే? నిన్ను చూస్తే మాకు భయంగా ఉంది, చెప్పొద్దూ!" అన్నారు.

కృష్ణుడు నవ్వి, "నేను మీవాణ్ణే గదా, ఈ ప్రశ్నలన్నీ దేనికి?" అన్నాడు. అందరూ పరమానందభరితులయారు.





# అరణ్యపురాణం

## 11

మౌగ్లీ మనుషుల చేత వెళ్ళగొట్టబడి అరణ్య జీవితానికి తిరిగి వచ్చి, మంద సమావేశమయే కొండశిఖరం మీద షేర్‌ఖాన్ చర్మం గుచ్చి, తాను ఇకముందు మందతో కలిసి వేటాడననీ, తన నలుగురు తోడే లన్నలతో కలిసి మాత్రమే వేటాడతాననీ, ప్రకటించాడు.

తరవాత అతను తన ఇల్లయిన పాత గుహకు వెళ్ళి ఆ రాత్రీ, మర్నాడు పగలూ నిద్రపోదా మనుకున్నాడు. కాని ఆ కార్య క్రమం అనుకున్నట్టు జరగలేదు. అతను తోడేలమ్మకూ, తోడేలయ్యకూ తన అను భవా లన్నిటినీ వారికి అర్థమయేటంత వరకు చెప్పాడు. షేర్‌ఖాన్ చర్మం వొలవటానికి ఉపయోగించిన కత్తిని వాళ్ళకు చూపాడు. దున్నలమందను షేర్‌ఖాన్ మీదుగా పరి గెత్తించటానికి తా మెలా సహాయపడినదీ చెప్పారు అకేలా, పెద్దన్నా. ఈ కబుర్లు వినటానికి భాలూ కొండ ఎక్కి వచ్చాడు. మౌగ్లీ సాగించిన పోరాటం గురించి వింటూ బాఘీర ఆనందం పట్టలేక ఒళ్ళంగా బరుక్కున్నాడు.

సూర్యోదయం ఎప్పుడో అయింది. కాని ఎవరూ నిద్రపోయే ఆలోచనలో లేరు. ఒక చెంప కబుర్లు సాగుతుంటే మధ్యమధ్య తోడేలమ్మ మోర ఎత్తి, కొండ మీది నుంచి వచ్చే పులిచర్మం వాసన అఘ్రాణించి ఆనందించింది.

అంతా చెప్పి మౌగ్లీ చివరకు. "అకేలా, పెద్దన్నా సహాయం చెయ్యక పోయినట్టయితే నా వల్ల ఏమీ అయిఉండేది కాదు. అమ్మా, దున్నలు కోనలో దూకుతూ దిగుతున్న ప్పుడూ, అవి గ్రామద్వారం కుండా పరిగెత్తు తున్నప్పుడూ చూడకపోతివి!" అన్నాడు.

అట్ట చివరి బొమ్మ



"నీ మీద మనిషిమంద రాళ్ళు విసిరి నప్పుడా? నా బిడ్డలను అలాటి పనులు చేసి, నక్కలను తరిమినట్టు తరిమితే నే నూరుకుంటానా? ఆ మనిషి మంద నంతా వధ చేసి ఉండేదాన్ని—నీకు పాలిచ్చిన ఆ ఆడకూతుర్ని మాత్రం వదిలిపెట్టే దాన్ని!" అన్నది తోడేలమ్మ.

తోడేలయ్య బద్ధకంగా, "చాల్లేవే! మన కప్పాయ్ మళ్ళీ తిరిగి వచ్చాడు, చాలు. ఎంత తెలివి సంపాదించుకొచ్చాడు! మనుషుల ఊసెత్తమాకు!" అన్నాడు.

"మనుషుల ఊసెత్తమాకు," అన్నారు భాలూ, బాఘీరలు కూడా.



మౌగ్లీ తోడేలమ్మ డొక్క మీద తల ఆనించి, తృప్తిగా చిరునవ్వు నవ్వుతూ, తాను ఇక మీద మనుషులను చూడననీ, వాళ్ళ కంఠస్వరం విననసీ, వాళ్ళతో ఎలాటి సంబంధమూ పెట్టుకోననీ అన్నాడు.

"ఒకవేళ వాళ్ళే నీతో సంబంధం పెట్టు కుంటే ఏంచేస్తావు, బుల్లితమ్ముడూ?" అని అకేలా అడిగాడు.

"మేము అయిదుగురం ఉంటాం!" అన్నాడు పెద్దన్న.

"ఆ వేటలో ఒక వేళ మనము కూడా ఉంటామేమో!" అన్నాడు బాఘీర తోక జోరుగా ఆడిస్తూ, భాలూ కేసి చూసి. తర వాత అకేలా కేసి తిరిగి, "ఇప్పుడు నీకు మనుషుల ఆలోచన ఎందుకు వచ్చింది, అకేలా?" అని అడిగాడు.

"ఎందుకా? చెబుతా విను," అంటూ అకేలా ఈ విషయం బయట పెట్టాడు:

మౌగ్లీ పులిచర్మాన్ని కొండ మీద గుచ్చి నాక, అకేలా గ్రామం దాకా వెళ్ళి, అరణ్య వాసులు ఉపయోగించే మార్గం తెలియ రాకుండా చెరిపేసి వచ్చాడు. ఇంతలో గబ్బిలం చెట్ల మధ్యగా ఎగురుతూ వచ్చి, "మనిషిమంద ఉండే గ్రామం తేనెపట్టు లాగా హడావుడిగా ఉంది," అన్నాడు.



"నువు ఏం చూశావేం?" అని అకేలా అడిగాడు.

"గ్రామ ద్వారం దగ్గిర ఎర్రపువ్వు పూసింది. దాని చుట్టూ మనుషులు తుపాకులు పట్టుకు కూర్చున్నారు," అన్నాడు గబ్బిలం.

అకేలా ఈ సంగతి చెప్పి, "మనుషులు సరదా కోసం తుపాకులు చేత బట్టరు. ఆ సంగతి నాకు బాగా తెలుసు. చూస్తూండు, బుల్లితమ్ముడూ! త్వరలోనే మనిషి తుపాకీతో సహా మన దారి పట్టి రాబోతాడు— వస్తున్నాడేమో కూడానూ!" అన్నాడు.

"ఎందుకని? మనుషులు నన్ను వెళ్ళగొట్టారు గద! వాళ్ళ కింకేం పని?" అన్నాడు మౌగ్లీ కోపంగా.

"బుల్లితమ్ముడూ, నువు మనిషివి. నీ జాతివాళ్ళు ఏం చేస్తారో, ఎందుకు చేస్తారో నీకే తెలియాలి!" అన్నాడు అకేలా.

మరుక్షణం మౌగ్లీ కత్తి మెరిసి నేలలో దిగబడింది. అకేలా చప్పున తన కాలు లాగేసి వెంట్రుకవాసిలో తప్పించుకున్నాడు.

"ఈసారి నన్నూ, మనుషుల్నీ కలిపి మాట్లాడేవు!" అన్నాడు మౌగ్లీ.

"ఛ! మహా వాడి కోర!" అన్నాడు అకేలా, నేలలో కత్తి దిగబడిన చోట



మూచూసి. "మనుషుల మధ్య ఉండి నీ దృష్టి మందగించింది, తమ్ముడూ. నువు కత్తితో పొడిచే లోపల నేను ఏకంగా జింకనే పట్టి ఉందును."

బాఘీర చప్పున లేచి నిలబడి మోర సాగినంత ఎత్తు చాచి, మూచూసి, కొయ్యబారినట్టయి పోయాడు. పెద్దన్న బాఘీర ఎడమ పక్కకు చేరి, తాను కూడా అలాగే చేశాడు. అకేలా గాలికి యాభైగజాలు ఎదురు పరిగెత్తి తాను కూడా బిగుసుకు పోయాడు. వాళ్ళకు గల ఘ్రాణశక్తి మౌగ్లీకి ఏనాడూ లేదు. అతని కున్నది మామూలు మనుషుల కున్నదాని కన్న హెచ్చే అయినా,

మూడుమాసాలు మనుష్యుల మధ్య ఉండి పొగ కలిసిన గాలి పీల్చటంతో కొంత మందగించింది.

"బలదేవుడు. మన దారి పట్టి వస్తున్నాడు. అదుగో అతని తుపాకీ మెరుపు," అన్నాడు మౌగ్లీ కూచుంటూ.

"మనుషులు వస్తారని నాకు ముందే తెలుసు," అన్నాడు అకేలా.

మౌగ్లీ అన్నలు నలుగురూ పొట్టల మీద పాకుతూ కొండ దిగి వెళ్ళి పొదల కింద అదృశ్య మయారు.

"మీ రెక్కడికి?" అని మౌగ్లీ కేక పెట్టాడు.

"శ్! మధ్యాన్నం లోపున వాడి పుర్రె దొర్లించు కొస్తాం," అన్నాడు పెద్దన్న.

"వెనక్కు రండి! మనిషి మనిషిని తినడు," అన్నాడు మౌగ్లీ.

"ఇంతకు ముందు తోడేలు నన్నవారెవరు? మనిషి అన్నందుకు నన్ను కత్తితో పొడవబోయిన దెవరు?" అని అకేలా ఎద్దేవా చేశాడు.

అన్నలు అయిష్టంగా తిరిగి వచ్చేశారు.

"నేను చేసే ప్రతిదానికీ సంజాయిషీ చెప్పుకోవాలా?" అన్నాడు మౌగ్లీ రౌద్రంగా.

"అదే మనిషంటే! మనిషి మాటంటే! ఉదయపూరులో బోనుల దగ్గిర మనుషులిలాగే మాట్లాడేవాళ్ళు," అని బాఘీర తనలో తాను గొణుక్కుని, పైకి గట్టిగా, "ఈ సారి మనిషికూన చెప్పేది నిజం. మనుషులు మందగా వేటాడతారు. మిగిలిన వాళ్ళందరూ ఏం చేస్తారో తెలుసుకోకుండా వారిలో ఒకణ్ణి చంపటం చేతగాని వేట అవుతుంది. ఆ మనిషి ఉద్దేశం ఏమిటో ముందు తెలుసుకుందాం," అన్నాడు.

"మేము రాం, నువొక్కడివే వేటాడుకో, తమ్ముడూ. ఈ పాటికి వాడి పుర్రె మాకు దొరికి ఉండేది," అన్నాడు పెద్దన్న.

—(ఇంకా వుంది)



# 65. మార్తాండాలయం

ఈ ప్రాచీన సూర్యాలయం కాశ్మీరు లోయ ఎగువన గల పీఠభూమి మీద ఉన్నది. ఇది 1200 ఏళ్ళ క్రితం కట్టినదని చెబుతారు. దీని శిల్పంలో గ్రీకు ప్రభావం కానవస్తుంది. ఇది ఇస్లామాబాదు (అనంతనాగ్)కు కొద్ది మైళ్ళదూరంలో ఉన్నది. ఈ ఆలయం శిథిలం కావటానికి కారణం తెలియదు.



Photo by Devidas Kasbeker



బహుమతి
పొందిన వ్యాఖ్య

సంతసానికి చంక కెత్తుకున్నా

పంపినవారు:
కె. ఎన్. రావు, ఉప్పలపాడు

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

పంతానికి పట్టుకొచ్చా

పంపినవారు:
కె. ఎస్. రావు, ఉప్పలపాడు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1967 జూన్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : సంతసానికి చంకకెత్తుకున్నా

రెండవ ఫోటో : పంతానికి పట్టుకొచ్చా

పంపినవారు : కె. నరహరిరావు,

ఉప్పలపాడు, (నెల్లూరుజిల్లా)

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'





నేడే చూడండి









అంజలీదేవి సమర్పించు చిన్నీబ్రదర్స్ వారి

# సతీ సుమతి



మ్యూజిక్. ఆదినారాయణరావు

డైరెక్షన్. వేదాంతం రాఘవయ్య.. ప్రొడ్యూసర్. చిన్నారావు

వాణీ రిలీజ్.

నాకు
ఒకటి
ఇవ్వూ!



మిఠాయిలు




కె.సి.పి. లిమిటెడ్,
ఉయ్యూరు & మద్రాసు

Criterion-KCP-947 Te

STUDIO Roopkala



భరణీ పిక్చర్స్

# గృహలక్ష్మి

హాస్య రస ప్రధాన సాంఘిక చిత్రం

నిర్మాత-దర్శకుడు: రామకృష్ణ

నవయుగ

N.V.K.R

# AWARDS!

## WON PLENTY

YET WE DON'T SAY
WE ARE THE BEST
ONLY
WE DO OUR BEST




PRASAD PROCESS PRIVATE LTD
CHANDAMAMA BUILDINGS MADRAS-26

